REGD. NO. M. 4793

# గృహలక్ష్మి

15th NOVEMBER 19



VOL. 16

# GRIHALAKSHMI

No. 11

PRICE AS. 6.



గృహలక్ష్మి
స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక
సంపాదకుఁడు :
డాక్టరు కే. యస్. కేసరి
GRIHALAKSHMI
సంపుటము ౧౯] నవంబరు 1947 [సంచిక ౧౧




## సాలుచందా మొదలగునవి

ఈ సచ్చిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయువలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

త్వరలో వస్తోంది!

సాటిలేని మేటినాటకమని
కొనియాడబడిన........

వింధ్యరాణి



ఆంధ్ర నాటక కళారంగంలో అసమాన
ఖ్యాతిగడించిన డి. వి. సుబ్బారావు
పుష్పవల్లి ----- రమణారావు
వరలక్ష్మి ---------- రేలంగి
డైరెక్టర్..సి. పుల్లయ్య స్టూడియో..జెమిని

నిర్మాతలు
వైజయంతీ ఫిలిమ్స్
లిమిటెడ్..మద్రాసు



క్రొత్తల్లుడు

చిత్రకారుడు: పి. రామకృష్ణన్ గారు.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

# గుడ్డలకరువు స్త్రీల కర్తవ్యము

"బోటికి ప్రాణము మానము"—అని సుమతీ శతకకారుడు వ్రాసియున్నాడు. అట్టి మానసంరక్షణార్థమేర్పడినదే వస్త్రము. ఆ వస్త్రమునకే నేడు కరువువచ్చినది.

16 మాసములుగా కేంద్రప్రభుత్వంవారు- గుడ్డలకరువు లేకుండాచేతామని చాలా సంప్రతింపులుజరుపుతూ స్కీములను యోచిస్తున్నారు. కడకు ఒక్కవిషయంలో నిర్ణయం జరిగిపోయింది. అదేమిటంటే- తయారైయేగుడ్డను తయారుచేసేక్రమము నిర్ణయించి- ఒకే మోస్తరుగుడ్డ తయారుచేయించాలి అని ఆ నిర్ణయము.

ఇప్పటికి దేశంలో తయారు అవుతున్నది 450 కోట్ల గజములగుడ్డయే. అయితే నిజానికి మన 40 కోట్లమందికీ సగటున 15 గ॥ లు మనిషి 1-కి అనేలెక్కతో 600 కోట్ల గజాలగుడ్డఅవసరము అని అంచనావేశారు. ఈ కొత్తపద్ధతివల్ల పుంజంతగ్గడంచేత మరి 100 కోట్లగజాలగుడ్డ వృద్ధికాగలదని అంచనావేస్తున్నారు. అయినా-ఇంకా 50 కోట్ల గజాల గుడ్డ లోటుతీరకుండానేఉంటుంది. మిల్లులమీద తయారయేగుడ్డ, మిల్లునూలు, వడుకు నూలుపెట్టి చేమగ్గాలపై నేసే గుడ్డ- అమాంబాపతు లెక్కవేయగా తేలిందే ఈ అంచనా.

అందుచేత మనం ఈ 50 కోట్ల గ॥ ల గుడ్డ కొరకు-సగటున తల 1-కి 15 గ॥ ల గుడ్డలోనూ-తగ్గించి పొదుపుగా వాడుకోవాలి. 15 గ॥ లు అంటే పురుషుడికి రెండు 6 మూళ్ల పంచలు, రెండు 5 మూళ్ల పైకండువాలు, రెండు 5 జానల తుండుగుడ్డలుపోగా-రెండు గోచులకు లేక గోణములకు మాత్రము పెచ్చుఉండును. స్త్రీలకు-రెండు 7 గ॥ ల చీరలున్నూ, రెండు రవికలున్నూ మాత్రమే రాగలవు. అయితే- ఈ 15 గ॥లలోనే-పక్క-దుప్పట్లు, ఆసుపత్రిలలో ఉపయుక్తమయ్యేసరుకు, మిలిటరీకి సప్లై అయ్యేగుడ్డ, అయిశ్వర్య వంతుల దోమతెరలు, డోర్‌కర్టన్లు, బల్లలపై పరచు రుమాళ్లు- మేజోళ్లు మొదలైన వన్నియు మినహాయింపగును. కావున చూడచూడ కొందరవశ్యముగా వస్త్రములేక బాధపడవలసినవా రవుతున్నారు.

ఇట్టి సంవిధానంలో కోయంబత్తూరులో నెలకొల్పబడే మిల్లులపైగాని, బిర్లా, టాటా, ధాకర్సేగా రుత్పత్తి చేయబోయే బట్టల యంత్రాలపైగాని దృష్టిఉంచుకొని చప్పరించడం అవివేకమైనపని అని గృహలక్ష్మికి వేరేచెప్పనక్క రలేదు. పప్పుపాయసాలకని పరులపంచన పడిగాపులుగాయకుండా కలిగినంతలో కలో గంజో కాచుకొని తనకొంపలోనే నాలుగుగోడలమధ్యా గుట్టుగా కాపురంచేయడాని కలవాటుపడినది ఇల్లాలు. కావున ఆమె ఇప్పుడు తనకు, తనబిడ్డలకు, భర్తకు గుడ్డకరువుతీరే ఉపాయము నవలంబించవలెను.

గాంధీమహాత్ముడు 27 సం॥ లుగా చెవినిల్లుకట్టుకొని పోరుతున్నాడుకదా - 'నూలు వడకండి, ఖద్దరుకట్టండి' అని. అప్పుడాయన కుప్పతిప్పలుగావచ్చిపడే విదేశవస్త్రాన్ని బహిష్కరించమనికూడా బ్రతిమలాడవలసివచ్చినది. ఇప్పుడు కొనడానికే గుడదొరకనప్పుడు బహిష్కరించడాని కెక్కడ కన్పిస్తుంది. కాబట్టి నేడు కావలసింది-నూలువడకడం-నూలువడకడం.

అయితే వడికిననూలును వడుకువారికి శ్రమలేకుండా తీసుకొనివెళ్లి గుడ్డనేయించి పెట్టడానికి తగిన సౌకర్యాలు మనరాష్ట్రంలో చాలినంతగాలేవని మాకు స్వానుభవమే. అందుకే కాబోలు; గాంధీమహాత్ముడు నూలుకొంతైనా ఇస్తేనేగాని ఖద్దరు అమ్మవద్దని కట్టడిచేసినాడు. ఆ విధంగా-నూలునే వస్తురూపకధనంగా తీసుకొని దానిని ధనంగా తప్పని సరిగా మార్చవలసిన అగత్యం-ఆఖద్దరు దుకాణుదార్లకు కల్పించాడు. తమ నూలుతో నేసినగుడ్డ తామే ధరించవలెననే అభిలాష సహజం, న్యాయం. కాబట్టి- పట్నాలలోను

పల్లెటూళ్లలోను స్త్రీలుసంఘాలుగాఏర్పడి నూలుఅంతా ప్రోగుచేసి- మొత్తముగానే చేనేత మగ్గాలకిచ్చి- గుడ్డతీసుకొని ఎవరిగుడ్డవారికి చేర్పించవచ్చు. పోనీ సంఘంనూలంతాకలిపేసి నేయించి సమష్టిన 'సంఘంగుడ్డ' అనేఅభిమానంతో తమతమనూలునకు దామాషాన గుడ్డతీసుకోవచ్చు. ప్రతీనెలాప్రభుత్వం మాకు కోటాక్రింద ఇచ్చేనూలుతో 10 రోజులే మగ్గం ఆడించసాధ్యం; మిగత 20 రోజులూ పస్తే- అని చేనేతమగ్గాలవారిగోల. కావున వారున్నూ ఇట్టి ప్రయత్నంహర్షించి ప్రోత్సహింపవచ్చు. ప్రభుత్వమును ఈ ప్రయత్నానికి దోహదమివ్వవలెను.

గంపెడు కబుర్లైనా ఒక్క-కార్యముతో సరిపోవు అని గృహలక్ష్మికి జ్ఞప్తిచేయ నక్కరలేదు. కావున మా సోదరీమణులు వెంటనే యిట్టిప్రయత్నాలు ప్రారంభించి కొనసాగింపవలెనని కోరుతున్నాము. ఇట్టి ప్రయత్నం ఎక్కడసాగుతున్నా దానికి మా పత్రికలోతగిన ప్రచురణమిచ్చి ప్రోత్సాహమివ్వడమేగాక-ఇతరులకును అట్లుగావింపవలెననే ఉత్సాహముకలుగుటకు తోడ్పడుతాము.

♦ ♦ ♦

ఈ సందర్భంలో ప్రభుత్వంవారికిన్నీ ఒక్క-హెచ్చరికచేస్తున్నాము. నిర్ణీతపునమూనా గుడ్డ (**Standard Cloth**) తయారుచేయడంలో ఒక్క-ప్రమాదమున్నది. పురుషులకు స్త్రీలకు ఒకేరకపుగుడ్డ పనికిరాదు. పురుషులకన్నా స్త్రీలు వారి పనిపాటలనుబట్టి కొంత చిక్కనిగుడ్డ అవసరమైనవారు. మరి అన్నిప్రాంతాలవారికి స్త్రీలకు ఒకేకొలతగుడ్డ పనికిరాదు. కేరళులకు కొద్దిమూరగుడ్డచాలును; ద్రావిడులకు- మాధ్వులకు- 18 మూళ్ల చీరలైనా అవసరము. నవనాగరికులగు యువతులు, 12, 10 మూరచీరలతో సర్దుకోగలుగు చున్నారుగాని- సౌకర్యార్థమువీరు అంతర్యమున పావడాలు, పరికిణీలుధరింతురు. ఇవికొన్ని గజములగుడ్డనుకోరును. సామాన్యముగా ఆంధ్రస్త్రీలకు సగటున 14 మూరచీరలైన అవసరము. కావున ఈ నూతనవిధానముక్రింద- ఏ గుజరాతీ, మార్వాడీ, బొంబాయి యువతుల అవసరమో గమనించి దానినే యావత్తు దేశమునకు నమూనాముగానిర్ణయించి, 10 మూళ్లచీరలో, 8 మూళ్లకోకలో- ఆంధ్రదేశమునకు దిగుమతిచేయకుండా సాలీనా ప్రతిస్త్రీకి కనీసము రెండైనను 7 గ॥ల చీరలు లభ్యమగునట్లు చూడవలయును- అని మా హెచ్చరిక. తప్పక దీనికి ప్రభుత్వమువారు గమనింతురని ఆశిస్తున్నాము.



# మద్రాసు శాసనసభలో స్త్రీలకు చెందిన 3 బిల్లులు

### శ్రీ కాళేశ్వరరావుగారి వివాహద్వయనిషేధము - వివాహవిచ్ఛేదముల బిల్లు

ఈసెప్టంబరు, అక్టోబరు సమావేశములలోనే మద్రాసు అస్సెంబ్లీలో ఈబిల్లు చర్చకు రాగా ఆ యాసభ్యు లీవిధముగా మాట్లాడిరి:—

### శ్రీమతి లక్ష్మీశంకరయ్యర్ గారు

వివాహద్వయము నిషేధించువరకు ఈ బిల్లు ఆమోదిస్తాను. అయితే వివాహ విచ్ఛేదము నంగీకరించను. అది హిందూవివాహ ధర్మసూత్రములకు వ్యతిరేకము. దాంపత్యముయొక్క పవిత్రత నది నాశనముచేయును.

### శ్రీ కే. భాష్యంగారు

సంఘానికి చెందిన ఇట్టి ముఖ్యమైన విషయాలను చాలా జాగ్రత్తగా యోచింప వలెను. కేంద్రప్రభుత్వమువారు నిర్ణయించిన కమిటీయొకటి ఇలాంటి విషయాలన్నిటిని కూలంకషంగా విచారణ సల్పినది. వా రారిపోర్టుపై ఏమిచేస్తారో చూతాము. ఇది దేశానికంతా సంబంధించిన విషయం. ఒకరాష్ట్రం ఒకరకంగా, మరొకటి మరోరకంగా చట్టములు చేస్తే—ఒకరాష్ట్రంలో చట్టసమ్మతమైన వివాహం మరోరాష్ట్రంలో చెల్లక చాలా చిక్కులురాగలవు. బహుపత్నీకత మనకు సామాన్యంగాదు. ఏకపత్నీకమే పరిపాటి. అయితే సంతానవిరహితుడు మరో పెండ్లి చేసుకోవడానికి అవకాశముండాలి. ప్రథమభార్య సమ్మతితో మరోపెండ్లికి అవకాశమివ్వాలి. వివాహవిచ్ఛేదము నంగీకరించు నంతగా సంఘము ముందుకునడవలేదు. అందుచేత బిల్లుకు నేను వ్యతిరేకినికాకపోయినా-ఈవిషయయాలను కేంద్రప్రభుత్వానికి విడువమంటున్నాను.

### శ్రీ వి. ఐ. మునుస్వామిపిళ్ళగారు

వివాహవిచ్ఛేదము హిందూ సంస్కృతికి వ్యతిరేకం. కొన్ని కొండజాతులవారి వివాహధర్మములు వేరు. ఇలాంటిబిల్లు చేసేటప్పుడు వాటినీ గమనించాలి.

### శ్రీ యన్. యస్. వరదాచారిగారు

హిందూధర్మములు అన్నివిధములగు ఉత్తమపద్ధతులవలంబించడానికి అనుకూల మైనవి. సాంఘికంగా ఏమార్పైనా చట్టముద్వారా నిర్బంధపరచడం నేనంగీకరింపజాలను. ఏకపత్నీవ్రతము మనదేశంలో ఆదర్శప్రాయమైనది. కొన్ని అనివార్యమైన సందార్భాలలోనే

రెండవవివాహం జరుగుతుంటుంది; ఆ పద్ధతి అలా సాగడమేమంచిది. అయితే కాళేశ్వర రావుగారు ఒహు వివాహనిషేధముతో తృప్తిచెందరాదా? వివాహవిచ్ఛేదముగూడా ఏల చొప్పింపవలెను? దీనిని హిందువులు పలువురు హర్షింపజాలరు. హిందూసంఘమున కొన్నికులాలలో ఈ వివాహవిచ్ఛేదపు పద్ధతిఉన్నది. అయితే వారంతా దానిని ఉపయోగించడంలేదు. ఇట్టి చట్టమువల్ల మానవుల మనస్తత్వములోనే మార్పు కలుగుతుంది. వివాహము పవిత్రధర్మముగాఉంటే పరస్పరము దంపతులు ప్రేమబద్ధులై ఒకరొకరియడల సహకారసానుభూతులు కలిగిఉంటారు. కాక అనుకూలాన్నిబట్టికూడ వీడడానికి వీలైనదైతే ప్రేమబంధాలు సడలి కుటుంబసౌఖ్యాలు చెడతాయి. కాళేశ్వరరావుగారిని ఈవిషయం గమనించకోర్తాను. భార్యను కష్టపెట్టేభర్తను, భర్తను రాపాడేభార్యను—శిక్షించడంకన్నా సంస్కరించడం మంచిది.

## శ్రీ కుమారరాజా ముత్తయ్యచెట్టిగారు

సాంఘికవిషయాల్లో చట్టాలు చేయడంకన్నా సంఘమేసంస్కారం పొందాలంటున్నారు. ఈ 20 సంIIలలో రాష్ట్ర, కేంద్రశాసనసభలు, సాంఘికచట్టాలు ఎన్నిచేయలేదు? ఈ బిల్లుకు నా సంపూర్ణామోదము. అయితే ఈలాంటి బిల్లువిషయంలో అనుకూలుర అభిప్రాయాలకన్నా ప్రతికూలుర అభిప్రాయాలు ఎక్కువ ఆదరింపదగినవి. రాజకీయాల్లో ఎట్టి ఉత్సాహములేని లక్షలకొలది ప్రజలబ్రతుకుకు సంబంధించినది ఈబిల్లు. వారి అభిప్రాయాలున్నూ తెలుసుకోవాలి. బహువివాహనిషేధం అందరికీ అంగీకారమే. అయితే వివాహసంబంధం బాధాకరమైనప్పుడు, దానికి విచ్ఛేదంతప్ప మార్గాంతరంలేదా? అయినా పదేళ్ళు సిదానించి చూచేది.

## స్వామీ సహజానంద

మానవనీతి పెంపొందడానికి వివాహధర్మం నిర్ణయమైంది. పురుషుడు తనకు నిర్ణయింపబడిన పంచయజ్ఞముల నిర్వర్తించను స్త్రీ పాణిగ్రహణం చేస్తున్నాడు. వారట్లా చేసే యజ్ఞముల కంతరాయములు కలుగికుండుటకే కుటుంబవృద్ధి కోరుకుంటున్నారు. అయితే ఆ భార్యవల్ల సంతానం కలుగకపోతే వేరొకతెను ఆమె ఇష్టముపై వివాహం చేసుకోమని ధర్మశాస్త్రం సమ్మతించినది. ఆమెవల్లా సంతానం లేకపోతే, అప్పుడు దత్తత చేసుకోమన్నారు. ఈసంగతులన్నీ ఈబిల్లు యోచించేపట్ల గమనించాలి. అయితే మీ పుణ్యమాయెను—'వివాహవిచ్ఛేదము' మాత్రం తెచ్చిపెట్టకండి. దానితో మన ఆడవాళ్లంతా పతితలైపోతారు; హిందూధర్మం, సంఘంఅంతా నశించిపోతుంది.

డబ్ల్యూ. జె. ఫెర్నాండిజ్

కాథలిక్ మతంప్రకారం కిరస్తానులము వివాహమును పవిత్రధర్మముగాం భావిస్తాము; అది ఆ మరణాంతబంధం. సంఘమును పునర్నిర్మించాలని యోచిస్తూ- దానికి అంగములైన కుటుంబాలకు అస్థిరత్వం కల్పిస్తామంటూ రేమి? కాథలిక్ మతం వివాహవిచ్ఛేదం అంగీకరించదు. న్యాయశాస్త్రరీత్యా అది విడిపోయినా- ధర్మరీత్యావారింకా భార్యాభర్తలే; అందుచేత వారెవరూ తిరిగీ వివాహమాడరాదు. నేను మొదటిభాగం-బహువివాహనిషేధం వప్పుకుంటాను.

శ్రీ బి. యస్. మూర్తిగారు

ఒక్కవివాహంతోనే కావలసినంత సంసారసౌఖ్యం చేకూరగలదు. వివాహవిచ్ఛేదము- అదొక పెద్దవిషయంకాదు. నిమ్నజాతులకు హరిజనులకు అది సర్వసామాన్యమైన హక్కు. దంపతులలో ఉభయులూ కార్మికులై, ఆర్థికంగా స్వతంత్రులైనచో స్త్రీలకు స్వేచ్ఛయివ్వాలి.

శ్రీమతి కుట్టిమాలుఅమ్మాళ్

ఈ బిల్లులో విషయాలను చాలామందిసభ్యులు చులకనగామాట్లాడడం విషాదకరము. ఇలాంటిచట్టంలేక స్త్రీలు చాలామంది బాధపడుతున్నారు. స్వతంత్రభారతదేశంలో స్త్రీపురుషు లుభయలుసమానంగా స్వతంత్రులుగాఉండాలి. ఈ బిల్లును సభవారు హృదయపూర్వకంగా ఆమోదించాలి. మలబారులో వివాహవిచ్ఛేద మొకరకంగా అమలులోఉంది. బహు భార్యాత్వము పూర్తిగా నిలిచిపోయిందనవచ్చు.

(నాటికి చర్చ నిలిచి తిరిగీ అక్టోబరు 16 న చర్చకు వచ్చింది.)

శ్రీ యం. పట్టాభిరామయ్యగారు

వివాహద్వయనిషేధ భాగము బాగుగా అమలుజరుగుటకు వివాహవిచ్ఛేద భాగము అత్యావసరము. దీనివల్ల హిందూసంఘము గట్టిపడునుగాని పలచబడదు.

శ్రీ వేదరత్నంపిళ్లగారు

గత జనాభాలెక్కలలో స్త్రీలు పురుషులకన్నా రెండులక్షలు హెచ్చుఅన్నారు. సెలెక్టుకమిటీలో ఈ సమస్య యోచించింది. ప్రక్కరాష్ట్రాలకువెళ్లి మళ్లీ పెళ్లిచేసుకొని రావడానికి వీలులేకుండాకూడా చూడండి.

శ్రీ ఆనందనంబియార్

విహహవిచ్ఛేద శాసనము చాలా అవసరము. దేశంలో యువతీయువకులు చాలా విద్యావంతులు అవుతున్నారు. ఈ చట్టాన్ని దుర్వినియోగంచేయరు.

శ్రీ కాళేశ్వరరావుగారి జబాబు

మీరంతా నాకిచ్చిన ప్రోత్సాహానికి వందనాలు. మీరు తెల్పిన హంశాలు సెలెక్టుకమిటీలో ఆలోచించి సవరణలుచేస్తాము. అఖిలభారతమహిళాసంఘంవారు వివాహ విచ్ఛేదపుభాగానికి చేయవలసిన సవరణలసూచిస్తూ ఒక విజ్ఞప్తిపంపినారు. ఆ సంఘంలో వారంతా విద్యావతులు; వారిఅభిప్రాయాలు అమూల్యాలు. ఏవిధంగానైతే, అత్యావసర మైనప్పుడున్నూ ద్విభర్తృకత్వము నిషేధింపబడ్డదో అట్లాగే- అత్యావసరమైనప్పుడున్నూ ద్విపత్నీకత్వము నిషేధింపబడవలసిందే అని వారన్నారు.

బొంబాయివారి బిల్లులో రెండవభార్యను చేసుకొన్నవాని పెద్దపెండ్లాముబ్రతికిఉంటే ఏకారణంచెప్పకుండానే వివాహవిచ్ఛేదం కోరవచ్చుఅనిఉన్నది. సెలెక్టుకమిటీవారి యిష్టమైతే ఈ సూత్రంచేర్చను నాకభ్యంతరంలేదు. ఏ సంస్కరణప్రారంభించినా మతం గంగిలో కలుస్తున్నదనే గోలఉంటుంది. మతానికేమి ఫరవాలేదు. మనం ముందుకు సాగిపోవాలి. రావు కమిటీరిపోర్టు (కేంద్రం) పర్యవసానంచూడమని కొందరు అంటు న్నారు. వారుచాలాసంగతులు కలిపారు. మనముఇక్కడ ఒక్కసంగతే యోచిస్తున్నాము. అందుచేత చేసేద్దాము.

డా. సుబ్బరాయన్ మంత్రి

ప్రభుత్వమువారు ఈబిల్లును సెలెక్టుకమిటీ కంపడానికి ఆక్షేపించరు. ఆక్షేపణలన్నీ అక్కడ యోచింపబడవలెను. సంఘంలోచాలా మార్పులురావలెను. వివాహవిచ్ఛేదన గడ్డైనవిషయం. అయితే, ద్విపత్నీకత్వము ఎప్పుడునిషేధించాలో, వివాహవిచ్ఛేదావసరం దానినంటేఉన్నది.

సెలెక్టుకమిటీకి బిల్లునంపు తీర్మానం నెగ్గినది.

సెలెక్టుకమిటీసభ్యులు

డా. పి. సుబ్బరాయన్, టి. విశ్వనాథం, శ్రీమతులు రుక్మిణీలక్ష్మీపతి,అమ్మన్నరాజా, కుట్టిమాలుఅమ్మ, శ్రీ కే. భాష్యం, వి. యం. రామస్వామిమొదలియారు, డా. మల్లయ్యా, శంకరసుబ్రహ్మణ్యమొదలియారు, దిగుమర్తిరామస్వామి, పట్టాభిరామయ్యా, వెంకటేశ్వర్లు, నటేశన్, కొఠారి, కాళేశ్వరరావుగార్లు. డా. సుబ్బరాయన్ గారధ్యక్షులు.

పడుపువృత్తి నిరోధకశాసన సవరణబిల్లు

మంత్రి మాధవమీనన్ గారు అక్టోబరు 9 వ తేదిన ఈ బిల్లును ప్రతిపాదించారు. ఈ బిల్లు ఉభయశాసనసభల ప్రతినిధులతోగూడిన సెలక్టుకమిటీవారి యోచనకంపుటకు తీర్మానమైనది.

మంత్రిమాధవ మీనన్‌గారు

అములులో ఉన్నచట్టంలో-నడివీధులలోగాని, బహిరంగస్థలాలలోగాని-విటులతో విటకత్తెలు బేరాలు, సరసాలు ఆడుతుంటే అలాంటివారిని పట్టుకొని రెండుసెలలపర్యంతము కారాగారశిక్ష విధించవచ్చుఅని ఉన్నది. ఆ శిక్షాపరిమితి 1 సం॥ శిక్ష చేయవలెనని ఈబిల్లు. అయితే ఇలాంటిశిక్షయున్నా బాగుపడుటకు వారికి చాలడంలేదు. పైగా వారాశిక్షాకాలంలో ఇతరకైదీలతో సహవాసంచేత ఇదివరకునేర్చిన వ్యభిచార దుర్గుణాలతోపాటు ఇతర నేరములుచేసేశక్తిన్ని సంపాదించుకొనివస్తున్నారు. అందుచేత-35 సం॥ లోపు యువతులను-శిక్షించే మ్యాజస్ట్రేటులు శిక్షానంతరం-రెండు సం॥లకు తక్కువకాకుండా 5 సం॥లకు హెచ్చుగాకుండా-ఏదైనా శిక్షణాలయం (Vigilance Home)లో విధిగా వసతిగాఉండి తర్ఫీదు పొందవలెనని నిర్ణయించవచ్చు-అనికూడా ఈ బిల్లులో చేర్చినాము.

బీగం అమీరుద్దీన్‌గారు

ఈబిల్లుఉద్దేశాన్ని నేను బలపరుస్తున్నాను. ఈబిల్లు కోరదగినదే కాదు; చాలాఅవసరంకూడా. అనేకమంది పతితులుతప్పకుండా నేరస్వభావులు. వాళ్ల పతనానికి అనేక కారణాలు: దారిద్ర్యం, దౌర్భాగ్యం ఆకలి-ఎన్నో.అలాంటివాటిని సంస్కరించి బాగుచేయాలి. మంత్రిగారు ఉచితమైన సమాధానమిచ్చినమీదట-సెలెక్టుకమిటీ తీర్మానంనెగ్గినది.

దే వ దా సీ బి ల్లు

మంత్రి సుబ్బరాయన్‌గారు దేవదాసీలుఅనే పేరట దేవస్థానాలలో-యువతులను దేవతలకర్పించడం-అనేపద్ధతి సాపుచేసేబిల్లు నానాడే (9-10-47) ప్రవేశపెట్టుచు ఇట్లుచెప్పినారు. ఈబిల్లును 1926 లోనే శ్రీ డా. ముత్తులక్ష్మిరెడ్డిగారు మద్రాసు కౌన్సిల్‌లో ప్రవేశపెట్టినారు. ప్రజాభిప్రాయానికిగాను ప్రచురింపబడినది. అవతల ఆ మంత్రివర్గంతొలిగింది. శ్రీమతి డా ముత్తులక్ష్మిరెడ్డిగారుకూడా కౌన్సిల్‌లో నుండితొలిగినారు. 1937 లో కాంగ్రెసుమంత్రివర్గంలో శ్రీమతి అమ్మన్నరాజాగారున్ను ఈలాంటిబిల్లు పెట్టినారు. అది సెలెక్టుకమిటీ కంపబడినది. ఆ మంత్రివర్గమున్నూ సెలెక్టుకమిటీవారు సవరించినబిల్లు ప్రవేశ పెట్టకముందే తొలిగిపోయారు. మాకుముందున్న మంత్రివర్గంలో శ్రీభాష్యంగారు ఈబిల్లు ప్రవేశపెట్ట దలచినారు; అనాటిరివిన్యూమంత్రి కరంత్‌గారున్ను ఈబిల్లువిషయమై చాలాశ్రద్ధచూపినారు. కానివారున్నూ బిల్లు ప్రవేశపెట్టకముందే పైకొలిగినారు. ("అయితే ఇది ఉద్యోగాలు ఊడగొట్టే బిల్లు" అని ఒకరు) అందుచేతనే ఇది విఘ్నాలుమోసినబిల్లు-అని చెప్తున్నాను. ఈ సారిఅయినా ఇది చట్టంగా ప్యాసవుతుందిఅని ఆశిస్తున్నాను. దీనికి సవరణలున్నూవచ్చాయి. శ్రీమతి సీతామహాలక్ష్మమ్మగారు భోగంమేళాల నిషేధబిల్లు నొకటిపంపినారు. ఈ సవరణలు ఈ సీతామహాలక్ష్మమ్మగారిబిల్లుఅన్నీ సెలెక్టుకమిటీలో చర్చింపవచ్చు.

శ్రీ. వి. ఐ. మునుస్వామిపిళ్లిగారు

ఈబిల్లునేను బలపరుస్తున్నా. ఈ దేవదాసీలను దేవతలకర్పించడం ఒకప్పుడు మతాభివృద్ధికరమై ఉండవచ్చు. రానురాను దుష్టఫలితాలిస్తున్నది. కాబట్టి ఈబిల్లు చాలాఅవసరం.

సెలెక్టుకమిటీ అంగీకరింపబడినది.

సెలెక్టుకమిటీ సభ్యులు:—

డా. సుబ్బరాయన్, శ్రీమతులు సీతామహాలక్ష్మమ్మ, అమ్మన్నరాజా, కుట్టిమాలూఅమ్మ లక్ష్మిభారతి, కె.భాష్యం, శంకరసుబ్రహ్మణ్యం, సంజీవరెడ్డి, కాశీశ్వరరావు, బీగం అమీరుద్దీన్, ఫి.నటేశన్, రజాఖాన్ గార్లు. శ్రీమతి అమ్మన్నరాజాగారధ్యక్షురాలు.

# విజయలక్ష్మి!

రచన: శ్రీ వడలి లక్ష్మీనరసింహామూర్తిగారు.

౧

ప్రపంచ సభలోన
దక్షిణాఫ్రిక గూర్చి
దక్షతతో మాట్లాడి
కక్ష సాధించావు విజయలక్ష్మి!
"స్మట్సు" దొరతో నీవు ఓ విజయలక్ష్మి!

౨

భారతీయుల మహా
ప్రజ్ఞతను సభలోన
స్వల్పంబు కాదంచు
చాటిచూపించావు విజయలక్ష్మి!
మాటి మాటికి నీవు ఓ విజయలక్ష్మి!



౩

నారీ ప్రపంచాన
తాగ్రవై వెలుగొంది
ప్రపంచ మహిళలకే
దారిచూపించావు విజయలక్ష్మి!
భేరి మ్రోగించావు ఓ విజయలక్ష్మి!

౪

దేశ దేశాలందు
నీకీర్తి, మనకీర్తి
చిరస్థాయియౌనటుల
విరచించి యుంచావు విజయలక్ష్మి!
కరము సంతసమాయెను ఓ విజయలక్ష్మి!

౫

మహిళల సంఘాన
అగ్రాసన ముందుండి
కన్నతల్లి సేవచేయుటయె
విధియంచు తెల్పావు విజయలక్ష్మి!
అక్రమ నోర్చావు ఓ విజయలక్ష్మి!

౬

భరతమాత ముద్దు
బిడ్డలై తనరారి
విశ్వ విశ్వములోన
స్తుతిమంతులైనారు విజయలక్ష్మి!
వింతాయె మీ చరిత ఓ విజయలక్ష్మి!

౭

అగణిత జ్యోతివై
విలసిల్లి జగమంత
వెలుగు నిండించావు
సాటి యెవ్వరునీకు విజయలక్ష్మి!
నేటి ప్రపంచాన ఓ విజయలక్ష్మి!!



# ఐకమత్యము

శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు

●

'ఛీ, ఉప్పుగల్లుకు కూడా కారగావన్న' సామెత ఫూరికే ఒచ్చిందా? దీన్నిబట్టి తెలియడంలేదూ? నీ వెంతో, నీ సామర్థ్యమెంతో?" అన్నారు. అక్కమ్మగారి వంట యింటిమూలలోవున్న కూరగాయలతట్టలోని మిరపకాయలంగారు!

దాంతో ప్రక్కనవున్న చెక్కపెట్టెలో లవణస్వాములవారికి ములుగర్రతో పొడిచినట్లైంది.

"ఏం? నీ ముందు నే నెందులో తీసిపోయాను? నా మూలాన్న అన్ని వంటకాలకూ రుచిబస్తుంది.

'లక్షాధికారైన లవణమన్నమె కాని
మెఱుగుబంగారంబు మ్రింగబోడు'

అన్నారుకాని 'కారమన్నమెకాని' అని అన్నారా? అది ఒక్కటిచాలదూ నా సామర్థ్యాన్ని నిరూపించడానికి?"

"చాల్లేవోయ్ నీ డంబాలు. నేనుమాత్రం ఏంతక్కువని? నాలోమాత్రం విశిష్టత లేదూ?

"మిరపగింజచూడ మీదనల్లగనుండు
కొరికిచూడ లోన చుఱుక్కుమనును
సజ్జనులగువారి సారమిట్లుండును"

అని సజ్జనులతో పోల్చారు పెద్దలు. అదీకాక కాస్తచులుకుగావుంటే 'సీమ మిరపకాయరా' అంటారుగాని నీ పేరైనా మెత్తరే! ఏమంటావ్? ... అంతే గదోయ్ పులుసుభాయీ?" అని ప్రక్కన కాగితంలోపెట్టిన చింతపండువైపు తిరిగింది మిరపకాయ.

ఆ ప్రశ్నతో నిద్రపోతున్న చింతపండు మహాశయుఁడు ఆవలిస్తూ లేచి చేతులూ కాళ్ళూ సవరించుకొని "మీలో మీకెందుకు తగువులు? ఏం, కారంభాయీ!" అని వాటిరెంటినీ సర్దబోయారు గాంధీజీలాగ.

"అంతేలేండి. ఏంశాశ్వతం? అని సగంయిష్టం, సగం అయిష్టం సూచిస్తున్న ధ్వనితో పులుసుగారి వాక్యాలను సమర్థించబోయాడు నెహూ్రపండితుఁడిలాగ కారం మహాశయుఁడు.

కాని లవణస్వామి జయప్రకాశ్ నారాయణ్ ఉద్ధృతం పుణికిపుచ్చుకున్నాడామె. ఊరుకుంటాడా? "ఏం, ఆ కారం ముందు నన్నెందుకు కదిలించాలి? అని ప్రొటెస్ట్ చేశాడు.

"పోనీ పెద్దలంటే చిన్నవాళ్ళూరుకోకూడ దబ్బాయ్?" అని సమర్థించాడు తింత్రిణీకుఁడు.

దాంతో చేదుమందుదాగిన 'పేషంట్' ముఖంపెట్టి ఒచ్చాడయ్యా, ఈ గాటికి మహామధ్యవర్తి, నేను చిన్నవాడినని చెప్పేందుకు. నేను మీకంటే ఏ విషయంలో చిన్నవాడినో వేలుపెట్టిచూపించండి? అట్టేమాట్లాడితే మీ యిద్దరూ నా కాలిగోరికిపోలరు. తెలిసిందా? అని 'ఛాలెంజ్' చేశాడు లవణస్వామి.

వెంటనే చింతపండుగారు నిప్పులుదొ్రక్కినకోతే అయ్యారు. "ఏమిటీ? కారాన్ని చులకనచేసిందేకాకుండా నన్నూనా? మీ యిద్దరికంటె నాలోవున్న విశేషత ఏమోతెలుసా? నా రుచిని మనుష్యులు మీ యిరువురి సహాయంలేకుండా తెలుసుకో వచ్చు. అదే నిన్నయితే నీ కారాన్ని తగ్గించడానికీ నేనేకావాలి. ఏం ఒప్పుకుంటారా? ఇప్పు డెవరుగొప్ప?

"నిన్నుమాత్రం అదేపనిగాతింటే ఏ మనిషైనా పళ్ళుపులిసిచస్తాడు." అన్నాడు మిరపకాయ మహాశయుఁడు నసుగుతూ.

"పళ్ళు పులవబట్టే మీ రుచులు తెలుసుకునే అవకాశంలేకుండా వాడునమల కుండా మింగుతాడు ప్రతిదీని. ఏం, యిప్పుడు తెలిసిందా నా మజా?" అన్నాడు కోపంతో తింత్రిణీకుఁడు.

"ఇకచాల్లేవోయ్ నీ డంబాలు." అని చప్పున అనేశాడు ప్రకోపంతో లవణ మహాశయుఁడు.

మిరపకాయగారు లవణమహాశయుఁడికి 'సపోర్టు'గా యేదోపలకబోయేంతలో వచ్చింది లక్ష్మమ్మగారు. దాంతో వీటినోళ్ళకు తాళాలు పడ్డయ్.

ఆ వచ్చిన లక్ష్మమ్మగారు మిరకాయలను పరపరాతరిగింది. వాటి అవస్థనుచూచి మిగతా రెంటిముఖాలూ జాలిపడ్తూన్నట్టు వెలవెలబోయాయ్. ఆ దయతేసి లక్ష్మమ్మ మిగతరెంటినికూడాకలిపి కమ్మని 'సాంబారు' కాచింది.

ఆ యింటివారంతా ఆ సాంబారు కమ్మదనానికి మెచ్చుకున్నప్పుడు తెలిసింది, ఆ మూడింటికలయికవల్లే యీ కమ్మదనం వచ్చిందని.

'పులుసు,' 'ఉప్పు,' 'కారాలే'; 'హిందూ' 'ముస్లిం' 'సిఖులై', 'లక్ష్మమ్మ'గారే 'గాంధీజీ'అయి, 'ఆ సాంబారే' వీరి సమైక్యతైతే, 'ఆకమ్మదనం' 'స్వరాజ్య' మెందుకు కాదూ? మీరేచెప్పండి!

# వేదకాలపునాటి స్త్రీలు





రాజా రంగయ్యప్పారావు బహద్దరు. ఎం. ఎ.,
డయ్యూరు కుమారరాజా



## వితంతువుకు సంఘంలో స్థానం; విడాకులు:

వేద మత ప్రకారము స్త్రీకి వివాహపు హక్కు ఒక్కసారే పెండ్లయిన తర్వాత భార్య భర్తకు అర్ధాంగి అవుతుంది. భర్త చనిపోయి నప్పటికీ వివాహ సంబంధము వదలిపోదు. ప్రమాదవశాత్తు భర్త స్వర్గస్థుడయినప్పుడు భార్య పండ్లు, దుంపలు మొదలగు శాఖాహారము తీసికొని శరీరము స్వాధీన పరచుకోవలెనని మనుస్మృతిలో ఉంది. 'ఏ స్త్రీ యీవిధంగా జాగరూకయై, అతి శాంతి యుతంగా పాతివ్రత్యమును కాపాడుకుంటుందో ఆమె కుమారుడు లేకపోయినను, స్వర్గము చేరగలదు.' యాజ్ఞవల్క్యుడు కూడా ఇదే అభిప్రాయమును ఇచ్చాడు. 'సముద్రములో కలియు నీరెట్లు సముద్రనీరువలె అన్ని విషయములలో మారిపోవునో భార్యకూడా వివాహానంతరము భర్తవలె మారిపోవును.' పురుషుడెప్పుడు ఒక్కడేకాడు. పురుషుడు, భార్య, సంతానము; భార్యపతివ్రతయై ఉన్నట్లయితే భర్త ఎంతపాపిఅయినను అతనిని నరకమునుండి స్వర్గమునకు తీసికొని పోతుందని చెప్పబడింది. స్వరములోనుండి నరకంలోకి తీసికొని పోవడమేకాదు. సావిత్రి విషయం మనకందరకు తెలిసిందే. సావిత్రియొక్క కార్యదీక్ష యముణ్ణి కూడ జయించి సత్యవంతుని ప్రాణాన్ని మళ్లీ భూమి మీదకు తీసుకొని వచ్చింది.

మనుస్మృతిలో వితంతు వివాహము కొన్నియెడల ఒప్పుకొన బడింది. వితంతువు కన్య అయిన యెడల మళ్లీవివాహము చేసికొనవచ్చునని శాసింపబడింది. ఇంతవరకు బాగానేఉంది అనుకుందాం. అయితే ఇన్ని నియమాలుపెట్టిన మనువు పురుషుల విషయంలో చాలా తేడా కనపర్చాడు. స్త్రీని పతివ్రతగా ఉండమని చెప్పినప్పుడు, పురుషుణ్ణి పత్నీ వ్రతుడుగా భార్య చనిపోయిన తర్వాతకూడా ఉండమని చెప్పలేదు. భార్యపోయినప్పుడు పురుషుడు సన్యసించాలి. ప్రపంచాన్ని వదలిపెట్టెయ్యాలి అని చెప్పినట్లయితే సమంజసంగా ఉండేది. కాని అట్లా చెప్పలేదు. భార్య చనిపోవడంతోనే మళ్లీ వివాహంచేసుకొని సంసారకృత్యం జరపవలసిందని చెప్పాడు. ఇది చాలా అన్యాయం దీనికి ఒక వింతకారణం చెప్పబడింది. పురుషుడికి భార్యలేనిదే మతసంబంధమైన కర్మలు చేయడానికి వీలులేదట. స్త్రీమాత్రం ఇంకొకణ్ణి పెండ్లిచేసుకుని కర్మకాండ ఎందుకు చేయగూడదు. రాను రాను ఈ అన్యాయపు పద్ధతి తీవ్రత తగ్గింది. తగ్గకుండా ఉండానికి

వీలు లేదు. చాణక్యుడి కాలం వచ్చేసరికి వితంతు పునర్వివాహం సంగతి కనబడుతుంది. అర్థశాస్త్రంలో ఈ విధంగా చెప్పివున్నది. "భర్త సన్యసించినా, లేక, చనిపోయినా పిల్లలు లేని భార్య ఎనిమిది నెలలుండి పెండ్లి చేసుకోవచ్చును. పిల్లలున్నట్లయితే ఒక సంవత్సరము పోయిన తర్వాత పెండ్లి చేసుకోవాలి." వితంతు వివాహము స్మృతుల్లో కూడా ఒప్పుకొన బడింది. వితంతు వివాహానికి కొన్ని కారణాలివ్వబడ్డాయి. భర్త కనిపించకపోయిన, చనిపోయిన, సన్యసించిన, నపుంసకుడయినా, కుల భ్రష్టుడయిన, స్త్రీ పునర్వివాహము చేసికోవచ్చునట. కాబట్టి కాలానుగుణ్యంగా ప్రపంచ పరిస్థితులు మార్తాయి, వాటితోపాటు సాంఘిక మర్యాదలు, మతములో మార్పులు, రాజకీయ పరిణామాలు, ఇవి మనం వద్దంటే ఆగవు. వాటంతట అవే వస్తాయి, వితంతు వివాహం వేదంలో అంగీకరింపబడకపోయినా క్రమక్రమంగా ఆచరణలోనికి వచ్చినట్లు గా తెలుస్తుంది. వేదకాలంలోకూడా వివాహమని ప్రత్యేకంగా ఏర్పరపబడకపోయినా "నియోగము" అనుపద్ధతిని విరివిగా ఉన్నట్లు తెలుస్తుంది. అది ఏమంటే సంతానమును భర్తయొక్క దగ్గర బంధువులవల్ల బడయవచ్చునని. కాని దీనికి గురువుల ఆజ్ఞ కావాలి. స్త్రీకూడా అనేక వ్రతములు చేయాలి. అప్పుడే వీలవుతుంది. అంతేగాక భర్త అనుజ్ఞవల్లకూడా ఇది జరుగవచ్చు. పాండురాజు శాపమువల్ల సంతానమును బడయుటకు వీలులేనప్పుడు తన భార్యయగు కుంతిని యమధర్మరాజువల్ల వాయుదేవునివల్ల సంతానమును కనుమని ఆజ్ఞాపించాడు. విచిత్ర వీర్యుడు సంతానము లేకుండా చనిపోయినప్పుడు సత్యవతీదేవి, భీష్ముని విచిత్రవీర్యుని భార్యవల్ల సంతానము పొందుమనగా భీష్ముడు బ్రహ్మచర్యవ్రతమును విడువనని చెప్పుటయు, అందువలన వ్యాసమహర్షివల్ల సంతానము పొందుట మనకందరకు తెలిసినవిషయమే. దీనంతటికంటె పునర్వివాహ మెంతో మంచిదని అందరు ఒప్పుకోక తప్పదు. కాని మొత్తంమీద వితంతు పునర్వివాహము ఎందుచేతో ఆచరణలోకి రాలేదు. ఇన్నిరోజులనుంచి అందరు సంఘ సంస్కర్తలు పునర్వివాహము మంచిదని చెప్పతున్నా, వారే దగ్గరుండి చాలా వివాహాలు చేయించినా, స్త్రీ పునర్వివాహవిషయంలో ఇంకాసంఘంలో చాలాఉదాసీన భావం చూపబడుతూంది. అందువల్లే దీనినిగురించి ఇంతగా చెప్పవలసివచ్చింది. క్రమక్రమంగా స్త్రీ పునర్వివాహము కూడా పురుషుల పునర్వివాహము లాగా మామూలు అయిపోక తప్పదు.

విడాకులు:

వితంతు వివాహమే ఒప్పుకోకపోతే సంఘంగాని ధర్మశాస్త్రంగాని "విడాకులు" ఒప్పుకుంటుందా? హిందూ ధర్మశాస్త్రప్రకారం వివాహం పవిత్రమైనది. జీవితాంతము వరకు విడచుటకు వీలులేనిది. పాశ్చాత్య దేశములలో పెండ్లి అంటే ఇతర ఒడంబడిక మాదిరిగా ఇదీ ఒక ఒడంబడికే. కాబట్టి రెండుపార్టీలకు ఇష్టములేకపోతే రద్దు చేసుకోవచ్చు. కాబట్టే పెండ్లికూడా రిజిష్టరు చేసుకోవాలి. వివాహాన్ని గురించి ఈ విధంగా చెప్పబడింది. "ఓ భార్యా భర్తలారా! మీరెప్పుడూవిడిపోవద్దు. సంసారములోఉండి పూర్ణాయువు గలవారై పుత్రులను పౌత్రులను కనుడు, సంతోషముతో, నిశ్చింతతో మీ

ఇంట్లోకాలం గడపండి.” ఎవడైన భార్యను వదలిపెట్టితే గాడిదతోలు కప్పుకొని ఊరంతా బిచ్చమెత్తమని నిర్ణయించ బడినది. ఇంతేగాదు, ఒక స్త్రీ భర్తయెడల అగౌరవము, అసహ్యము, చూపినను విడచుటకు వీలులేదు కాని కొన్నిచోట్ల మాత్రం యాజ్ఞవల్క్య మహర్షి, మనువుకూడా “అధివేదన” అని ఒప్పుకున్నారు. ఒక స్త్రీ నిషా పానీయములు త్రాగుటకు అలవాటుపడ్డా, చెడ్డనడత నడచినా, ఆడపిల్లలనుమాత్రమే కనుచున్నా, “ఇంకొక స్త్రీని వివాహమాడ వచ్చు”నన్నారు. ఆడపిల్లలనే కన్న మాత్రంచేత ఇంకొక స్త్రీని వివాహమాడుమనే విధానం ఈరోజుల్లో మనమెవ్వరం ఒప్పుకోం. సాధారణంగా ఎవరూ ఈరోజుల్లో అట్లా చేయలేదుకూడా. కాని భర్త చెడునడతనడిస్తే తాగుబోతయితే, భార్య చేయవలసిందేమిటి? ఎంతవరకని అవస్థపడుతుంది. ఇటువంటి విషయాల్లో విడాకులుండి తీరవలసిందే. మహాత్మాగాంధీగారికి ఒక స్త్రీ తనభర్త తననుచాల కష్టపెడుతున్నాడు, చేయ వలసింది ఏమిటీ? అని వ్రాయగా, గాంధీగారు ఏమిటామార్గం లేకపోతే భర్తపై క్రిమినల్ కేసుపెట్టాలి లేకపోతే ఇంట్లోనుంచి వెళ్లిపోయి, భర్తమీద పోషణకు దావా తీసుకరావాలన్నారు. దీనిని బట్టిచూస్తే మనకు తేలేదేమిటంటే విడాకులుండాలని. పూర్వమునకు ఇప్పటికి పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. స్త్రీలు కేవలం భర్తలమీద ఆధారపడి ఇంట్లోనే ఉండక బయటికివచ్చి సాంఘిక జీవనంలో పాల్గొంటున్నారు. విద్యాభ్యాసం చేస్తున్నారు. మగవారితో సమానంగా న్యాయవాదులుగా, వైద్యులుగా పనిచేస్తున్నారు. కాబట్టి భార్యా భర్తలు సమానులుగాని ఒకరి కొకరు లొంగి యుండరు. అందువల్ల వారికి ఒకరిమీద ఒకరికి ఏకారణము చేతనైనా అసంతృప్తికలిగి కాపురంచేయడందుర్లభమయితే కోర్టులోకూడా జీవితం దుర్భరమని నిర్ణయింప బడ్డట్టయితే, తప్పక విడాకులు ఇవ్వవలసిందే. జీవితం అంతా వారిని బాధపడమనడం చాలాఅవివేక మయినపని. ఏ యేకారణములుంటే విడాకు లివ్వవచ్చునో మొదలయిన విషయములు, న్యాయవాదులు నిర్ణయించ వలసిఉంటుంది. పూర్వాధారాలుకూడా కొన్ని ఉన్నాయి. కౌటిల్యుని అర్థశాస్త్రములో ఈ విధంగా చెప్పబడిది. “స్త్రీకి భర్తమీద ఇష్టం లేకపోయినా, ఎవరంతటనారు విడాకు లిచ్చుటకు వీలులేదు. కాని వారిద్దరికి ఇష్టమయినట్లయితే విడాకులివ్వ వచ్చును. అప్పుడు భార్యకు వివాహకాలమందు పెట్టిన వస్తువులు మొదలైన ఆస్తి ఆమెకు ఇచ్చివేయవలెను. భార్యే తనంత తాను వెళ్లిపోవాలని కోరినట్లయితే ఆస్తిమీద తనకున్న హక్కును వదలుకోవలెను” కాబట్టి కొన్నికొన్ని అవసరమైన కాలములలో విడాకులిచ్చుటే ఉత్తమం. అయితే ఇది అమెరికాలోలాగ ఒక్కొక్క స్త్రీ ఎనిమిది పెండ్లిండ్లు చేసుకోవడం భర్త యింటికిరావడం ఆలస్యమయితే, నిద్రపోయేటప్పుడు గురకపెడితే విడాకులు కావాలని కోరడం తటస్థిస్తుంది; మనదేశములోని పాతివ్రత్యము, కుటుంబ క్షేమము నశించుతుందని కొంతమంది అంటారు. ఇప్పుడు విడాకులు ఉన్నదేశాల్లో అన్నింటిలో ఇలాలేదు. ఒక్క అమెరికాలో మాత్రం ఈపద్ధతి ఎక్కువగా ఉంది అంతేగాక మనదేశములో ఒకపురుషుడు ఎంతమంది నైనా వివాహమాడవచ్చునని ఉందిగదా! సాధారణముగా పురుషుడు ఒక్కభార్యకంటే వివాహమాడినట్లుగా కనబడదు. అట్లాగే విడాకులనేది ఎప్పుడో అవసరంవచ్చినప్పుడు భరింపనలవిగాని పరిస్థితు లేర్పడ్డప్పుడు గాని ఇతరసమయాలలో ఉపయోగపరచుటకు గాదు.

(సశేషము)

# నా జీవిత చరిత్ర



నేను ద్రవిడవంశమున జన్మించితిని. నా జన్మభూమి తిరుపతి. కర్రా కాశయ్యా, వెంకయ్యా, రామయ్యా, జోగయ్యా, అనువారు మా తాతగార్లు దివాన్, పెష్కార్లుగాను, ప్లీడర్లుగాను, ఆస్థానపండితులుగాను వుండిరి. మా తండ్రి కర్రా రామశర్మ పోలీసు ఇన్‌స్పెక్టర్‌గాపనిచేసి నేటికిని పెన్‌షన్ పుచ్చుకొనచూ, తమ స్వగ్రామముననే యున్నారు. తల్లి సుబ్బలక్ష్మమ్మ (కవయిత్రీ శిరోమణి) చంద్రకళా విలాసమను ప్రబంధమును రచియించియుండిరి. అయ్యది విద్వాన్‌కు పాఠ్యగ్రంధముగానుండెను. యిప్పుడువారు మరణించి 4 సంవత్సరములైనది.

అత్తవారూరు యీ తాలూకాకు మూడు కోసుల దూరమునగల యఱ్ఱగుంట్లపల్లి. శ్రోత్రియము మా వారు. శ్రోత్రియందార్లు గొప్పభూస్థితి గలిగినవారు. నేటికిని మేము శ్రోత్రియందారని చేవ్రాలు చేయుచుందుము. భర్త గంటి వెంకట సుబ్బయ్యగారు, బి. ఎ. వీరు బొంబాయిలో జనరల్ మోటార్సులోవున్నతోద్యోగులై యుండిరి. 1940 లో వీరిని కాలగర్భములో దాచినది నా దౌర్భాగ్యము. నా కొకకొడుకూ కొమారుడునూ గలరు కొమారుడు 17 సంవత్సరముల వయస్సు కాలేజీలో చదువుచున్నాడు.



నేను బహు విద్యావతినిగాను యేదో మా తాతగారైన నాగపూడి కుప్పుస్వామయ్యగారు తెనుగునందు కొంత పరిచయము గలుగజేసిరి. చిన్నదనమున వావిలికొలను సుబ్బారావుగారు ఒంటిమిట్టలో జరుపుచున్న పరీక్షలలో 3,4 పరీక్షలలో వుత్తీర్ణనైతిని. హిందీ, వార్ధావిద్యాపీఠమువారి భాషాకోవిద పరీక్షవఱకు చదివి పట్టముపొంది ప్రచారము చేయుచుంటిని. యీ యూరియందునూ యింటిలో కొన్నిక్లాసులు జరుపుచూ ప్రొద్దుపుచ్చుకొనుచుందును. ఆంగ్లమున కొంతవరకు పరిచయముగలదు. కన్నడభాష ప్రయిమరీ పరీక్ష అయియుంటిని. గిరిజాకల్యాణమను నొక అయిదాశ్వాసములుగల ప్రబంధము రచించియున్నాను. దానిని ముద్రించు భాగ్యమెన్నడు గలుగునో తెలియదు.

—గంటి కృష్ణవేణమ్మ.

# నా చిన్ననాటి ముచ్చట్లు



కే. యన్. కేసరి





## తీర్థ యాత్రలు

### కాశీ యాత్ర



అలహాబాదులో 1910 సం॥ డిశంబరు నెలలో కాంగ్రెసుమహాసభ జరిగినది. దానికి నెల్లూరినుండి శ్రీ మైదవోలు చంగయ్య పంతులుగారును, వెంకటగిరిరాజాగారి ఉన్నత పాఠశాల కప్పటి ప్రధానోపాధ్యాయులు శ్రీ ఏ. సంతాన రామయ్యంగారును, శ్రీ విస్సా లక్ష్మీనరసయ్య పంతులుగారును నేనును—వెళ్లి అక్కడనుండి కాశీయాత్రకు వెళ్లితిమి. కడపటి ఇరువురము కుటుంబములతో బయలుదేరితిమి.

కాశీలో బసచేసి గంగాస్నానము చేసి విశ్వేశ్వరుని దర్శించితిమి. అది డిశంబరు నెల యగుటచే అమిత చలి. ఆ విపరీతమైన చలికి, గంగాస్నానముచేసి గట్టునకు వచ్చేలోపలనే కాయముకట్టెవలె మారినది. గంగగట్టున సన్యాసులు చలిమంటలు వేసుకొనుచుండిరి. వారికి తలాకానీయిచ్చి,—ఆ మంటవద్ద చలి కాచుకొంటిమి. ఆ పిమ్మట విశ్వేశ్వరుని దర్శించితిమి. ఈ స్వామికి గర్భగుడిలేదు, తలుపులులేవు, అర్చకుడులేడు, డబ్బుఅడుగువాడులేడు. భక్తితోపోయి మనసారదర్శించి శక్తికొలదిపూజించి, నమస్కరించి వచ్చే ఆచారము కాశీలో మాత్రమేకలదు. మారేడుదళములను మనచేతులతోనే శివలింగముపై నుంచి, గంగాభిషేకమును మనచేతులతోనే చేయవలయును. ఈ స్వామికి నగలులేవు వస్త్రాలంకారమును అనవసరము. ధననిర్ధనికూడ నిరాటంకముగ ఈస్వామినిదర్శించి సేవించి పావనుడు కావచ్చును. 'నీ జాతి యేమి' అని అక్కడ ఎవ్వరుఅడుగరు. అన్నపూర్ణా విశాలాక్షిని ఆ సాయంకాలము సేవించితిమి. ఈ విధముగా మూడురోజు లక్కడ గడిపి చెంబులలో గంగాతీర్థము గైకొని వచ్చితిమి.

'వారణాశి' అని కాశీకి మరొకపేరు. 'వారణా'—'అశి'—అని రెండు ఉపనదులు కాశీకి రెండువైపుల ప్రవహించి గంగలో కలియును. ఆ రెండు నదుల మధ్యయుండుటచే

'వారణాశి' అని ఆ పట్నమునందురు. పట్నమంతయు అర్ధచంద్రాకారముగ నదిగట్టున పొడవుగానుండును. పురాతనపట్నమగుటచే కాబోలు, ఎత్తైన కండ్లతో, మేడలతో, ఇరుకువీధులతో నిండియుండును. కావున తెలిసినవారి సహాయములేనిదే క్రొత్తవారు ఆ పట్నములలో తిరుగజాలరు. నది పొడవున—గొప్ప భవనములున్నవి. ధనాఢ్యులు పలు ప్రాంతములనుండి పిదప కాలమున వారణాశిలో నివసించి, అక్కడనే మృతిచెందిన-సరాసరి స్వర్గముచేరుదుమని ఆభవనముల కాపురముందురట. నదిపొడవున పురాణ ప్రసిద్ధములు చరిత్రాత్మకములునగు అనేక 'ఘట్టము'లు కలవు. దశాశ్వమేధఘట్టము, హరిశ్చంద్రఘట్టము మున్నగునవి అట్టివే. ఇక్కడనే ఊరిమధ్య 'జ్ఞానవాపి' లేక 'కూపము' కలదు. యాత్రికులు అక్కడకువెళ్లి పూలు పండ్లు అందువేసి పవిత్రులు, 'జ్ఞానవంతులు' నగుదురు. అయితే వారు అందువేసిన వస్తువులు కుళ్లి దుర్గంధములే అగుచుండును. 'గాడిదేవిగుడి'యని-యొకటి హరిజనవాడ మధ్యనున్నది. ఎంతటి ఆచారవంతులైనను ఆ వాడకు అరమరికలు లేకుండావెళ్లి గవ్వలుకొని ఆ గుడిలోవేసి వచ్చినగాని కాశీయాత్ర ఫలితము దక్కదుఅని వాడుక. నది కావలిగట్టున కాశీమహారాజుగారు నివసింతురు. వారి ఆఫీసులు అక్కడనే యుండును. యాత్రికులలో నుత్సాహవంతులు కొందరు పడవలపై నదిదాటి వానినన్నిటిని చూచివత్తురు. పలుదేశములనుండి పలువురువచ్చి పోవుచుండురుగాన పట్టణమున 'గల్లీ'లు (వీధులు) చాల అపరిశుభ్రముగానుండును.

## గయ

*

అచ్చటనుండి గయాక్షేత్రమునకువెళ్లితిమి. గయాలో గయావళులచేతికి చిక్కితిమి. యాత్రికులగు దూరదేశస్థులకు అచ్చట ఆచారవ్యవహారములుతెల్పి యాత్రసుఖకరమగునట్లు చూచుటకై ఏర్పడ్డవారు వీరు! మమ్ము ఒక గల్లీలోనుండు నొకయింట బసకుదిర్చి ప్రవేశపెట్టిరి. ఆ యిల్లు చాలా చీకటిగదులతో కూడుకొన్నది. చాలా అపరిశుభ్రముగా కూడా నున్నది. గయాశ్రాద్ధమును హోటలులోపెట్టునట్లు ఏర్పాటుచేసిరి. మేముపెట్టు శ్రాద్ధములలో బ్రాహ్మణార్థము చేయవచ్చిన గయావళులు, అంతకుముందే ఆ హోటలులోనే పెట్టబడిన శ్రాద్ధములలో పాల్గొన్నవారే. మేమున్నూ అక్కడనే ఒక ప్రక్కకూర్చున్నాము. దర్భతంత్రముజరిగినది. ఆకులువేసినారు. కడుపునిండియున్న గయావళులు త్రేన్పుతూ, ఆకులముందు కూచున్నారు. పసుపుకలిపిన అన్నమును, పాయసమును మాత్రము గుర్తించగలిగితిమి. తక్కిన పదార్థములను గుర్తించలేకపోయితిమి. అయితే మాకు బాగా తెలిసిన గడ్డపెరుగుకూడావడ్డించిరి. భోక్తలుగాకూర్చున్న గయావళులు వండి వడ్డించిన పదార్థములలో ఇష్టమైనదానిని రుచిమాత్రముచూచిరి. పిమ్మట వటవృక్షమువద్దకు

మమ్ములను తీసుకొనివెళ్లినారు. అక్కడ వారికి వంటినిండ గంధముపూసి పూజించి దక్షిణ యివ్వవలయును. పితృదేవతలను తలుచుకోవలయును. కర్తలు ప్రమాణపూర్తిగా నేను యింత మాత్రమే దక్షిణయివ్వగలనని చెప్పవలెను. అట్లా చెప్పనియెడల—'గయాశ్రాద్ధ ఫలితమస్తు' అని వీపునగట్టిగకొట్టరు. ఆ దెబ్బను వారు గట్టిగకొడితేనేగాని చచ్చినవారు స్వర్గలోకమునకుపోరట! కనుక యాత్రికులు అబద్ధమాడియైన దెబ్బతిని తృప్తిచెంది యింటికివచ్చెదరు. గయలో పనిలేనివారంతా 'గయావళీ' ఉద్యోగమున కమరుదురట.

ఈ గయాపట్టణ సమీపముననే బుద్ధభగవానుడు—జ్ఞానమునుపొందిన చోటుగలదు. బౌద్ధులకది గొప్పయాత్రాస్థలము.

## ప్రయాగ

*

గయనుండి తిరిగీ ప్రయాగ (అలహాబాదు) వచ్చితిమి. ఈ సారి యాత్రపూర్తిచేసు కొనుటకు, ప్రయాగలో త్రివేణి సంగమమునకువెళ్లితిమి. త్రివేణీసంగమమనగా—గంగయు, యమునయు, సరస్వతియు నిచ్చట కలియుచున్నవి. ఆ సంగమస్థానమునకు (నదీ మధ్యము నకు) పడవలోవెళ్లి—మావెంటతీసుకొనివెళ్లిన పసుపు,కుంకుమ, పూలు, రవికెలు—అచ్చట సమర్పించి త్రివేణిని పూజించితిమి. ఆ పిదప బసకువచ్చి—ఆ నాడు కోటవగైరా చూడ దగిన ప్రదేశములను చూచితిమి.

## జగన్నాథము

*

ఇక్కడనుండి జగన్నాథమ్ము చేరితిమి. జగన్నాథమున ఒక ఉరియామంగలి తీర్థవాసు నింట దిగితిమి. అక్కడ మనము వంటచేసుకొని భోజనము చేయగూడదట. దేవాలయ ములో వండిన పదార్థమునే దేవతాప్రసాదముగ భుజించవలయును. గనుక ఆక్కడి మంగలి కుండలతోవండిన అన్నమును, పప్పును మట్టిపాత్రలతోనే తెచ్చి మాకు పెట్టెను. ఇక్కడ దేవాలయములో 7 కుండల దొంతిమీాద అన్నమును వండెదరు. అనగా 7 కుండలలోను బియ్యము నీళ్లుకలిపి ఒక దానిమీాద యొకటి నా పొయిమీాద పెట్టెదరు. అవి అన్నియు ఒకే సమయమున పచనమగును. ఇట్లు వండిన అన్నమే స్వామిప్రసాదము. ఈ ప్రసాద మును వైదిక శిఖామణులున్నూ ముందు ముత్తైదువలు సహా—ఏవగింపులేక భుజింతురు. ఏవగించినచో కండ్లుపోవునట! ఇక్కడకూడ తీర్థవాసులతో చాలకష్టమున్నది. వీరున్నూ యాత్రికులను పీడించి-పెద్ద మొత్తములను వాగ్దానముతీసుకొనెదరు. ఉన్నమటుకు మొదట తీసుకొని మిగత సొమ్మునకై ప్రతినెల జాబులు వ్రాయుచుండెదరు. ప్రసాదమును పంపు చుండెదరు. మనపై విలాసములను తీసుకొనెదరు. కొంత కాలమైనతర్వాత వారే వసూళ్లకు

బయలుదేరుదురు. అందువల్ల కొందరు తప్పుపేర్లను చిరునామాలను వార్లకుయిచ్చి తప్పించుకొనెదరు. మహాక్షేత్రమున ఆడినమాట తప్పకూడదనేవారున్నూ చాలమందికలరు.

ఇచ్చట తీర్థవాసులు తరతరాలుగా నా వృత్తి నవలంబించియుందురు. వీరు యాత్రికుల గోత్రనామావళులతోసహా రికార్డు నుంతురు. ఆరికార్డు అంతయు వారికి హృత్కవిలియే. యాత్రికులకు—వారు స్వామికిచ్చు భోగమునకు (నైవేద్యపుపడి) రశీదు లిప్పింతురు. వారి సంతతులవారు వెళ్లినపుడు ఊరిపేరులు కనుక్కొని పూర్వము వారిపూర్వులు అర్పించిన భోగమునుండి ప్రసాదము తెచ్చి యిత్తురు.

ఇచ్చట జగన్నాథుడు ముఖ్యదేవుడు. బలరామస్వామియు ఉపదేవత. ఇక నిచ్చట స్త్రీదేవత లక్ష్మిగాని, రుక్మిణిగాని గాక సుభద్ర—ఇది అపూర్వము, జగన్మోహనాకారుడైన శ్రీకృష్ణభగవానుడు తన చెల్లెలి కట్టివరమిచ్చెనని ఏదో పుక్కిటి పురాణమును చెప్పుదురు. ఇచ్చటి విగ్రహములు మామూలు అన్ని దేవాలయములలోవలె, శిలానిర్మితములుకావు. దారు (కొయ్య) నిర్మితములు- ఇదియు అపూర్వమే. శ్రీ కృష్ణబలరామాది యాదవుల నిర్యాణానంతరము ఉప్పెనవచ్చి ద్వారక మునిగిపోగా—నీమూడు అరగాలిన శవములు— సముద్రమున కొట్టుకొనిరాగా ఇచ్చట రేవుపట్టించి దారు నిర్మిత విగ్రహముల నాకంకాళముల పొందుపరచిరనియు నొక గాథగలదు. ఇచ్చట వర్ణవివక్షతగాని, ఎంగిలి, అంటుగాని పాటించని కారణముననే "సర్వంజగన్నాథము" అనే సామెత వెలసినది.

కాశీయాత్ర అనంతరము కొన్నాళ్లకు కేరళదేశ యాత్రకు బయలుదేరితిని.

## కే ర ళ దే శ యా త్ర

*

శ్రీ దివాన్ బహదూర్ దొడ్ల రాఘవయ్యగారు ఆరోజులలో తిరువనంతపురంలో (తిరువాన్కూరు) దివానుగా నుండిరి. ఆసమయముననే నేను మళయాళదేశ యాత్రకు బయలుదేరితిని. శ్రీ రాఘవయ్యగారు నాకు చిరపరిచితులు. అందుచే ముందుగా తిరువనంత పురమునకు వెళ్లితిని. వీరు నాకు పద్మవిలాసమను భవనమున బసకుదిర్చిరి. అచ్చట నాకు కావలసిన అన్నిఏర్పాట్లు చేయబడినవి. పద్మనాభస్వామివారి దర్శనము చేయించిరి. ఇచ్చట తిరువాన్కూరు రాజ్యమంతయు శ్రీ పద్మనాభస్వామివారిదనియు వారి ప్రతినిధులుగా వారిదాసులై తాము రాజ్యమొనర్చుచున్నామనియు—ఈ రాజులు భావింతురు. రాజ బిరుదములలో "పద్మనాభదాస" అనునదియు కలదు. అనంత పద్మనాభస్వామివారి విగ్రహము చాలా గంభీరముగ నుండును.

శ్రీ రాఘవయ్యగారు నాయందలి మైత్రిచే నాకు ఒకరోజున వారియింట విందు గావించిరి. ఆరోజున మద్రాసు హైకోర్టు జడ్జీగారగు శ్రీ కుమారస్వామి శాస్త్రిగారున్నూ వారికతిథులుగా వచ్చియుండిరి.

తిరువనంతపురం సంస్థానములో యుండు ప్రతిక్షేత్రమును దర్శించుటకు-అక్కడి సర్కారు ఉద్యోగస్థులకు దివానుగారు ఉత్తరములువ్రాసి నాకు చక్కని ఏర్పాట్లు గావించిరి. ప్రతిస్థలములోను స్వామిదర్శనమునకు భోజనమునకు చక్కని ఏర్పాట్లను కుదిర్చిరి.

కన్యాకుమారి

*

అక్కడనుంచి మేము మొట్టమొదట కన్యాకుమారి క్షేత్రమునకు పోతిమి. అక్కడ సర్కారు సత్రములో దిగితిమి. ఆ సత్రములోయుండే బావినిచూచినప్పుడు గుంటూరు బావులు నాకు జ్ఞాపకమునకు వచ్చినవి. వంటవాడు వంటచేయులోపల మేము సముద్ర స్నానమునకు వెళ్లివచ్చితిమి. ఇచ్చట పడమటిసముద్రము, తూర్పుసముద్రము సంధించు స్థలము. భారతదేశమునకు కొన యిది. ఇక్కడ అలలు ఉరవడిగా కొట్టుకొనుచుండును. అందుచే స్నానమొనర్చువారికి ప్రమాదములేకుండా లావాటి ఇనుపగొలుసులను అడ్డముగా కట్టియుంచిరి. అక్కడి క్షేత్రవాసులు శ్రీరాముడు ఇక్కడనుండియే వారధికట్టి లంకపై దండెత్తెనని చెప్పుదురు. అవిగో పెద్దరాళ్ల వంతెనను చూడుడు అని వారు చూపుదురు; కాని వార్లకవి అగపడినట్లు మనకు కనబడవు. ఇదియే సేతుబంధన స్థలమనెదరు. స్నానాంతరము దేవాలయమునకువచ్చి అమ్మవారిని దర్శించి పూజించితిమి. అమ్మవారి విగ్రహమునకు పసుపుదట్టముగ మెత్తబడి యుండును. పావడనుగట్టి శృంగారింతురు. చూచుటకు 10 సం॥ ల కన్యకవలెనే యుండును. అమ్మణ్ణి ఎంతో అందముగానుండును.

ఆ సముద్రతీరమున నల్లఇసుక ఎర్రఇసుక కనపడును. ఈ యిసుకతోనే బంగారు నగలను మెరుగుపెట్టుదురు. బ్లాటింగు పేపరు ఈ దేశమునకు రాకమునుపు సిరాతో వ్రాసిన కాకితములపై చల్లి సిరావ్రాత నారపెట్టుటకు ఈ యిసుకను ఉపయోగించేవారు. పూర్వపు కరణాలవద్దను, ఆఫీసులలోను ఇంకను ఇతర ముసద్దీలవద్దను ఈ యిసుక సిద్ధముగా నుండేది. ఈ కన్యాకుమారి అనే ఊరు చూచుటకు కొండప్రదేశమున (Hill station) కట్టినట్లుండును, సముద్రమువడ్డు ఆనుకొని యుండును.

సు చీం ద్ర ము

*

ఈ ఊరువిడిచి సుచీంద్రమునకు వెళ్లితిమి. ఇక్కడి దేవాలయము చాల పురాతన మైనది గాక అందమైనదికూడ. ఈ దేవాలయము కట్టడమున కమర్చబడిన రాతిస్తంభముల మీద చెక్కబడిన బొమ్మలసొగసు వర్ణనాతీతము. ఈ ఊరి సత్రములో మేము దిగితిమి. స్వామిదర్శనమునకు పోయివచ్చులోపల మాగుడ్డలను దొంగ లపహరించిరి. మాకు కొంత బరువు తగ్గినది.

జ నా ర్ద న ము

*

ఇది తిరువనంతపురమునకు సమీపమున వర్కలస్టేషనుకు రెండుమైళ్లదూరమున యున్నది. చిన్న మెట్టమీద జనార్దనస్వామి దేవాలయము గలదు. స్వామిపానవట్టము క్రిందుగుండ గొప్పజలధారపారుడువచ్చి ప్రక్కనయుండే గొప్పకోనేరులోపడును. ఆ జలము టెంకాయనీరువలె నిర్మలముగయుండును. స్నానమునకు హాయిగనుండును.

షెం కో ట

*

షెంకోటలో మేము రాజభవనమున దిగి అక్కడనుండి స్టీముబోటులో వైకము ఆలప్పళె, అంబలప్పళె మొదలగు క్షేత్రములకు పోతిమి. పిమ్మట ఎర్నాకుళముపోయి ప్రసిద్ధ వకీలు సుగుణపాయిగారింట బసచేసితిమి. వీరు సరస్వతిబ్రాహ్మణులు. మత్స్యములను తినుటకు అలవాటుపడినవారు. ఆ నాడు మాకు మాత్రము వడ్డించలేదు. వీరు చేపలు తిందురనేవిషయము మాకు తెలిసిన పిమ్మట మాకు ఆనాడు అన్నము సహించలేదు. అయితే వారిచ్చిన మధురఫలహారములతో పొట్టనింపుకొంటిమి. సర్కారుస్టీముబోటు నెక్కి తాతాపురముపోయి అక్కడ కోకోజం, సబ్బులు, తలనూనెలు వగైరాలను తయారు చేయు గొప్పపరిశ్రమశాలను చూచితిమి. అక్కడనుండి మంగళాపురంచేరి శ్రీనివాసపాయి గారింటదిగితిమి. వీరు నెల్లూరులో కొంతకాలము డిస్ట్రిక్టుజడ్జిగనుండినవారు. ఇక్కడనుండి మేము ఉడిపికిపోయి కృష్ణుని దర్శనమును చేసితిమి. ఆనాడు మఠములో స్వాములవారితో కూడ విందారగించితిమి. ఉడిపిలో యెనిమిదిమఠములున్నవి. ఈ మఠములలో ప్రతిదినము వచ్చినవారికందరికి అన్నదానము జరుగుటగలదు. అనేక బ్రాహ్మణ కుటుంబములు అక్కడనే స్థిరవాసమేర్పరచుకొని జీవించుచుందురు—ఆనాడు కృష్ణునికి దేవాలయములో గుడి ప్రదక్షిణ ఉత్సవముజరిగినది. ఆ నాడుపండువెన్నెలగ్రాత్రి. స్వామిగుడి ప్రదక్షిణము చేయు నప్పుడు భక్తులు జాజిపూలను గంపలకొలదితెచ్చి స్వామిమీద చల్లెదరు. గుడిఅంతయు

జాజిపూలతో నిండియుండును. వెన్నెల రాత్రియగుటచే దేవాలయమంతయు పిండిఆరబోసి నట్లుండును. "పుష్పేషుజాజీ"-పుష్పములకెల్ల శ్రేష్ఠమైన పుష్పము జాజి. ఈరాత్రి వుత్సవమును వర్ణించుట సులభముకాదు—ఈ దేశమున జాజిపూలు అమితముగ దొరకును. ఈ పూలమొగ్గ వృందారంగుగనుండి విచ్చినపిమ్మట తెల్లగనుండును— ఇక్కడనుండి గోకర్ణమునకు పోదలచితిమిగాని వర్షాకాలమగుటచే వీలుకాదాయెను.

## తి రు చూ రు

❋

మంగళాపురంనుండి కాలికట్టుకుపోతిమి. అక్కడనుండి తిరుచూరుకుపోతిమి. తిరుచూరులో వడక్కనాథర్ స్వామిని దర్శించుటకు దేవాలయ ముఖద్వారమునకుపోతిమి. అక్కడి గేటుజవాను నాచేత గుడ్డ గొడుగు వుండుటవల్లను నేను బనియర్ వేసుకొనినందునను మమ్ములను లోపలవిడువలేదు. ఈరెంటినిలేకుండ లోపలికిపోయి ఈశ్వరునిదర్శించితిమి.

## కు త్తా ళ ము

❋

తిరుచూరునుండి ఈ రోడ్డుమార్గమున శ్రీరంగము, మధుర, తిరునల్వేలి చూచుకొని కుత్తాళముకు చేరితిమి. కుత్తాళములో శ్రీ మౌనస్వామిమఠములో బసచేసితిమి. ఈ స్వామి నాకు మద్రాసులో పరిచయమగుటచే వీరుమమ్మాదరించి అనుగ్రహించిరి. అక్కడి ఆకాశగంగలో కొన్ని దినములు తృప్తిదీర స్నానమును చేసితిమి. అక్కడి చల్లని జల్లులలో ఆప్యాయముగ తడిసితిమి. అక్కడి పచ్చిజాజికాయలను, లవంగములను, ఏలక్కాయలను తనివితీరతాకి రుచిచూచితిమి. అయిదు ఆకాశధారలవద్దకుపోయి త్రోవలో యుండు లతావృక్షముల సౌందర్యమనుభవించితిమి. కుత్తాళమునుండి తిరిగివచ్చునప్పుడు మధురలో దిగితిమి.

## మ ధు ర

❋

ఈ మధురలో వారముదినములు మకాంచేసి దేవాలయముయొక్క అద్భుత శిల్పశాస్త్రప్రదర్శనమును దినముచూచుచుండినను తనివితీరలేదు. పురాతన హిందువుల గొప్పతనమును దెలుసుకొనుటకు ఈ దేవాలయ గోపురములు, రాతిస్థంభములలో చెక్కబడిన సుందరమైన విగ్రహములే సాక్షులు, ఎంతకాలము యీ చిత్రములను చూచినను వింతగనే యుండును. దక్షిణదేశములోయుండు దేవాలయములలోనెల్ల యిదియేగొప్పది. పరిశుద్ధముగనుండునది. చక్కనియేర్పాట్లుగలది. ఈ దేవాలయము మానవులు గట్టినదా? దేవతలు గట్టినదా? అని సందేహము గలుగుచున్నది. ఈవూరిలో యున్ననదిపేరు వేగవతి.

దేవాలయములోని రాతిస్థంభములమీద చెక్కడముపని బంగారు చెక్కడమును మించి యున్నది.

ఈ దేవాలయమున దక్షిణభాగము మీనాక్షీ దేవికి సంబంధించినది; ఉత్తరభాగము సుందరేశునికి సంబంధించినది. ఇందు అష్టలక్ష్మీమండప మొకటిగలదు. లక్ష్మీదేవియొక్క 8 రూపములు ఇక్కడ విగ్రహములుగా వేయబడియున్నవి. ఇక్కడనే మీనాక్షీ సుందరేశుల కథలును చెక్కబడియున్నవి. ఈ మంటపమునకు ప్రక్కననే సుందరమైన గణేశ విగ్రహమున్నూ, ఆరుతలలతో షణ్ముఖస్వామి విగ్రహమున్నూ కలవు. ఆతరువాత మీనాక్షీ దేవి వేటాడు ఆటవికస్త్రీగాను, సుందరేశుడు వేటగాడుగాను చెక్కబడిన చిత్రగాథలున్నవి. ఆ ప్రక్కన మీనాక్షీనాయక్ - నాయకరాజుల ప్రధానమంత్రి కట్టించిన గొప్పమండప మున్నది. నేడది దేవుని ఏనుగల మొగసాలగా ఉపయుక్తము. ఈఏనుగలచే-గొప్పవారు వచ్చినప్పుడు మ్రొక్కింతురు. గతసంవత్సరమున శ్రీ గాంధీమహాత్ముడు వెళ్లినప్పుడు ఆయన నట్లే గౌరవించిరి. ఆ మొగసాలకు ఇత్తడిరేకు తలుపులు. ఆద్వారమావల—పొత్తామరై (బంగారపుతామర కొలను) ఉన్నది. దానిచుట్టునున్న అంచుగోడపై—సుందరేశుడు మధురలోగావించిన 64 మహిమలు చెక్కబడినవి. పాండ్యుల పురాతనరాజధానినగరము మధుర. పాండ్యులు పాండవుల సంతతియని గాథ. పాండ్యరాజులు మీనాక్షీ దేవాలయమున పంచపాండవుల విగ్రహములను చెక్కించియున్నారు.

ఆ లోపలనే సుబ్రహ్మణ్యస్వామి దేవాలయమున కటునిటు వాలిసుగ్రీవుల విగ్రహములు, చంద్రమతి హరిశ్చంద్రుల విగ్రహములు చెక్కబడియున్నవి. దేవాలయం బయట- తిరుమల నాయకుని సత్రంకలదు. సుందరేశుడు తిరుమలనాయకునికి ప్రతి సం॥ మున్నూ 10రోజలు అతిథిగానుందునని వరమిచ్చెనట. స్వామివారువచ్చి విడిదిచేయుటకు అర్హముగా నీ సత్రము కట్టించబడినది. దీనిని కట్టించుటకు 22 సం॥ లు పట్టెననియు 10 లక్షల సవరలు ఖర్చైయ్యెననియు చెప్పుదురు. కొంతదూరములో తిరుమలనాయకుని రాచనగుళ్లున్నవి. వాని సౌందర్యము చెప్పశక్యముకాదు. ఆ దర్బార్ మహల్ కన్నులవైకుంఠమే. సుమారు 60 అడుగుల మధ్యకొలతగల్గి-దాదాపు 75 అడుగుల ఎత్తున-గుమ్మటముగా స్తంభములు లేకుండ కట్టించిన ఆ దర్బార్ మహల్ శిల్పచాతుర్యము—చూచియే తీరవలయును. వీటన్నిటిని చూచినప్పుడు విజయనగరప్రాంతమునుండి దూరదేశమగు దక్షిణమునకువచ్చి రాజ్యమొనర్చుటయేగాక ఎంతెంత పనులుచేయించి, ఎంతవైభవ మనుభవించిరో మన తెలుగునాయకులు అని తోచి, ఆశ్చర్యము, గర్వము కలుగును. మధురకు రెండు మైళ్లదూరములో తిరుక్కైకుండ్రమను స్థళములో గొప్పశివాలయముగలదు.

రా మే శ్వ ర ము

*

మధురనుండి రామనాథపురం దర్భశయనం మొదలగు క్షేత్రములను చూచుకొని రామేశ్వరమునకు చేరితిమి. నివసించుటకు మంచియిల్లు దొరికినది. అక్కడచేరిన మర్నాడు మొదట యాత్రికులు చేయవలసిన కార్యక్రమ కర్మములు మొదట క్షౌరకల్యాణము, పిమ్మట చంద్రపుష్కరిణిలో ముక్కుమూసుకొని స్నానము, అటుపిమ్మట దేవాలయములో యున్న బావులలోని శుద్ధోదకస్నానము! బావిలోనుండి చేదిపోసిన నీటిబుంగకు ఒక్కంటికి అప్పుడు కాని యిచ్చితిమి. తర్వాత లింగార్చనచేసి భోజనమునకు పోయెడివారము. మాకు సంతానములేకుండుటవలన ఇక్కడ నాగప్రతిష్టను చేయదలచుకున్నాము. ఆవూరిలో దొరుకు నాగమయ్యాలన్నియు ఒకసారి ప్రతిష్టచేసి తీసి మరల విక్రయించు నవగుటచే నేను మద్రాసుకు వ్రాసి క్రొత్తనాగమయ్యాను తయారుచేయించి పంపమంటిని. అది వచ్చుటకు కొంత ఆలస్యమైనందున మేము యిక్కడ 10 దినములుండవలసి వచ్చెను. "నాగమయ్యా శిల" రైలు పార్శిలుద్వారా వచ్చినది. ప్రతిష్టకుముందు చేయవలసిన తతంగములన్నియు జరిగినవి. మేళతాళములతోకూడ నాగమయ్యాను నా రెండుచేతులలో పండబెట్టి దేవాలయమునకు వూరేగుతు పోవలయునని పౌరోహితుడు చెప్పెను. సరే నంటిని. మేము దిగియున్న యింటికి దేవాలయమునకు సుమారు అర్ధమైలుండును. ఆనాడు సూర్యభగవానుడు తీక్షణముగనుండెను. మద్రాసునుండివచ్చిన నాగమయ్యా పెద్దదగుటచే భారముగనుండెను. నాగమయ్యాను యెత్తుకొని కొంతదూరము సాగితిని. కాళ్లు కాలు చుండెను. మాడు మండుచుండెను. రెండుచేతులు వణకసాగెను. స్వామిని క్రిందపడ వేయుటకు సిద్ధమైతిని. వెంటనే ప్రక్కనున్న నాభార్య దేవాలయము దగ్గరకు వచ్చినది; 'క్రిందపడవేయవద్ద'ని వేడుకొనెను. పండ్లుబిగపట్టి కొంతదూరము సాగితినిగాని పౌరోహితుని సహాయములేక గుడిచేరలేకపోతిని. స్వామిని దించితిని. ఆయన ప్రక్కననే నేనుకూడ కొంతసేపు కూర్చుండి అలసట తీర్చుకుంటిని. నాగప్రతిష్ట మంత్ర తంత్రములతో జరిగెను. ఆవూరు విడచివచ్చునాడు మనము ప్రతిష్టచేసిన నాగమయ్యాను చూచిపోవుదమని యిరువురము గుడికిపోతిమి. మేము ప్రతిష్టచేసిన నాగమయ్యా మాయమైనాడు.

రామేశ్వరములో దేవాలయము చాలవైభవముగా నుండును. ఇచ్చట నాజూకైన శిల్పచాతుర్యముకన్న డౌలు హెచ్చు. శివాలయమున గర్భగుడికి చేరబోవునప్పుడు ఇరువంకల నున్న ఎత్తైన విగ్రహములు, పైని ఆచ్ఛాదన చూచుకొలది- ఉభయపార్శ్వముల బారులు తీరిఉండే సామంతరాజులు సేనానులు మొదలైనవారి మధ్యనుంచీ రాజదర్శనార్థము పోవుచు న్నాము అనిపించును. దీని నీవిధముగా నాటుకోటిచెట్లు లక్షలాదివెచ్చించి కట్టించినారందురు.

తంజావూరు

✻

తంజావూరులోయున్న రాజాసత్రమున దిగితిమి. దేవాలయమునకు పోయి బ్రహ్మాండమైన లింగమునుచూచి పూజించితిమి. ఎదురుగనున్న పెద్ద వృషభమునుచూచి ప్రదక్షిణముచేసి తాకి ఆనందించితిమి. ఈ దేవాలయముచుట్టు అగడ్తగలదు. పూర్వపు తంజావూరు రాజులు ఈ దేవాలయమునే కోటగాకట్టుకొనిరి. దేవాలయపు ప్రహరీగోడలు చాల పొడవైనవి. శిధిలమయిన స్థితిలోయున్న శ్రీ సరస్వతిభాండాగారమునకు వెళ్లి నమస్కరించితిమి.

ఈ తంజావూరు దేవాలయము 1000 సం॥ ల నాటిదని చెప్పుదురు. ఈ దేవుని పేరు బృహదీశ్వరుడు. గోపురమున కెదురుగా—బలిపీఠమున్నది. అక్కడ కాకులకు బలి వేయుదురు. తంజావూరునందు తెలుగునాయకరాజులు కొన్నాళ్లు రాజ్యముచేసి సంగీత సాహిత్యములను హెచ్చుగా పోషించిరి.

తిరువయ్యారు

✻

తంజావూరికి సమీపమున తిరువయ్యారు పంచనదీతీరమునవున్నది. ఇక్కడనే మన తాగయ్యగారు నివసించి రాముని భజించి కీర్తనలుపాడి కీర్తిని బడసిరి. వీరి సమాధికి ప్రదక్షణమును చేసితిమి. వారుండిన యింటికిపోతిమి. ఆ యింటివారు త్యాగయ్యగారు ఆరాధించుచుండిన పురాతనపు శ్రీరామపంచాయతనం దేవతార్చన మందనమును చూపిరి.

మేమును ఆదేవునికి నమస్కరించితిమి. అక్కడ కొంతసేపు కూర్చుని దాహమును తీర్చుకుంటిమి. ఇప్పుడక్కడ పేరుగడించిన శ్రీ బెంగుళూరు నాగరత్నంగారు చాల ధనమునుఖర్చుపెట్టి దివ్యమైన భవనమును కట్టించి ఏటేటా త్యాగయ్యగారికి ఉత్సవములను జరుపుచున్నారు. ఈ వుత్సవమునకు గొప్ప విద్వాంసులందరువచ్చి కచ్చేర్లు చేయుచున్నారు. ఈ వైభవము చూడదగినదట.

శ్రీరంగం

✻

తంజావూరునుండి శ్రీరంగముచేరినాము. శ్రీరంగదేవాలయ గోపురముదర్శించగనే

"కావేరీ గిరియాత్తోయం వైకుంఠ రంగమందిరం
పరవాసుదేవో రంగేశ ప్రత్యక్షంపరమంపదం"

అని స్మరించుచు ఏకాదశి సత్రమున దిగితిమి. ఆనాడు మధ్యాహ్నము రాత్రి యును రంగని సేవించి పూజించితిమి. మరునాడుదయముననే పోయి స్వామియెదుట జరుగు విశ్వరూప దర్శనమునుచూచి సంతసించితిమి. కావేరి కొల్లడములో, బ్రహ్మ

ముళ్లతో స్నానముచేసి అయ్యంగారి పురోహితునకు దక్షిణను సమర్పించితిమి. దేవాలయమునకుపోయి పులిహోర, దధ్యోజనము, నేతిగారెలను కొనుక్కొని యింటికి పోతిమి. భోజనానంతరము గుడిలోని విశేషములను చూచుచు వడ్లుదంచు శాలను చూచితిమి. సాయం సమయమున రంగనాధుని ఉంపుడుకత్తెయగు బీబీనాంచారును చూచితిమి. ఆనాడుకూడ స్వామికి తురకపెండ్లాము కావలసివచ్చినది. దగ్గరయుండు భార్యలగు శ్రీదేవి భూదేవులను మోసగించి అప్పుడప్పుడు పూలరంగడు బీబీవద్దకు రాత్రిళ్లు పోయివచ్చునట. స్వామిపోయినరాత్రి అక్కడ సుగంధద్రవ్యముల పరిమళము మనోహరముగనుండును. శ్రీరంగనాధస్వామి ముఖమునయుండు చందనముకూడ సుగంధద్రవ్యములతో కలిపియుండును. ఒక బిళ్లను ఒకరూపాయికి అర్చకులు అమ్మెదరు.

మళయాళమునందలి మధురయందలి శిల్పచాతుర్యము ఇక్కడ తక్కువగాని దేవాలయము చాల హేరాళముగ నుండును. సప్తప్రాకారములు చాలవైభవముగా నుండును. బయటి ప్రాకారము ఎత్తు 20 అడుగులకుపైన యుండును. దానిపైన వెడల్పు 6 అడుగులు. 15 గాలిగోపురములు.

శ్రీరంగమునుండి తిరుచనాపల్లికివచ్చి అక్కడి వుచ్చిపిళ్లారికొండనెక్కి పిళ్లారి (విఘ్నేశ్వరుడు) ని దర్శించితిమి. కొండమీదినుండి శ్రీరంగము తిరుచనాపల్లి పట్టణములను చూచిన చిన్నవిగను చిత్రముగను కనుబడును.

కుంభకోణం

❋

తిరుచునాపల్లినుండి కుంభకోణంచేరితిమి. ఇక్కడ నాపరిచితులగు దివాన్ బహదూరు భాష్యమయ్యంగారు జడ్జిగనుండిరి. వారింటిలో బసచేసితిమి. ఆవూరిలో నాలుగు దినములుండి కావేరిస్నానము, దేవుళ్ల దర్శనముచేసుకొని చిదంబరము చేరితిమి.

ఈ కుంభకోణములో 16 దేవాలయములున్నవి; వానిలో—12 శివునివి; 4 విష్ణువువి. అన్నియు చూడదగినవే. సారంగపాణి (విష్ణు) దేవాలయము చాలగొప్పది. ఇక్కడి గాలిగోపురం సుమారు 150 అడుగుల ఎత్తుండును; మెడ వెనుకకు విరుచుకొని గాని శిఖరమును చూడజాలము. ఈ స్వామికి రెండుకొయ్యరధములున్నవి. అందొకటి చాలాపెద్దది.

చిదంబరము

❋

చిదంబరములో యొక నాటుకోటుశెట్టి వారిసత్రములో దిగితిమి. స్నానానంతరము సమయమునకు నటరాజస్వామి దర్శమునకుపోతిమి. చిదంబర రహస్యమును నటరాజు వైభవమునుచూచి ఆనందించితిమి. అప్పుడక్కడ నందన్ చరిత్రము తలంపునకువచ్చెను.

ముఖ్యముగ శ్రీ సరస్వతీబాయి చెప్పు నందనచరిత్ర హరికథ జ్ఞాపకమునకువచ్చి మరియొకసారి నటన సభాపతికి ప్రదక్షిణముచేసి అక్కడనుండి పయనమైతిమి.

చిదంబరం దేవాలయం చాలా ప్రాచీనమైనది; ఇచ్చట ఏటేటా రెండు గొప్ప ఉత్సవములు జరుగును. అందొకటి, "ఆణితిరుమంజనం"; రెండవది "ఆరుద్ర దర్శనము." 10 రోజు లీయుత్సవములు జరుగును. ప్రతిదినము లక్షలాదిజనము వచ్చెదరట.

ఈ దేవాలయం ప్రాకారాదులతో కోటయున్నట్లుండును. 18వ శతాబ్దమధ్యమున-పరాసువారు, ఆంగ్లేయులు, హైదరలీ క్రమముగా ఈ దేవాలయమును తమ కోటగా నుపయోగించుకొన్నారని చరిత్రలలో చెప్పుదురు. ఇందలి విశేషము శివకేశవాలయములు సమీపస్థలములై యుండుట యొకటి.

సామాన్యముగా వైష్ణవాలయాలకే వైభవమెక్కువ; ఈశ్వరాలయములలోని వైభవముకన్నా మహిమ హెచ్చుగా కన్పించును. ఇచ్చట అట్లుకాక నటరాజస్వామి ఆలయమున వైభవమును హెచ్చుగానుండును.

శ్రీ నటరాజస్వామి నృత్య మండపము యొక్క ఆచ్ఛాదనము బంగారు రేకుతో తాపటము చేయబడినది. శ్రీ నటరాజస్వామి ఆ మంటపమున ఒక కాలెత్తి తగుహస్తవిన్యాసమున తాండవించుచున్నట్లున్న ఆ విగ్రహము సొంపు ఎన్నాళ్లైనను మరువజాలను. ఎన్నాళ్లనాడో చూచిన ఆ విగ్రహము శ్రీమతి యం. యస్. సుబ్బలక్ష్మి అమ్మాళ్ "కాలైతూక్కి"అని పాటపాడగా విన్నప్పుడెల్లను కన్నులఎదుట ప్రత్యక్షమగు చుండును. స్వామికి వెనుకప్రక్కనగల నల్ల చలువరాతితో కట్టబడిన స్వామివారి పవ్వళింపు సేవామందిరమును ఎంతో మనోహరముగానుండును.

మామూలుగా చిదంబర రహస్యమందురు. అనగా నేమియు లేదు. ఇచ్చట లింగము "ఆకాశలింగము" తేక "వాయులింగము". హిందూ వేదాంత శాస్త్రరీత్యా పంచభూతములలో వాయువును ఆకాశమును వేర్వేరు భూతములైనను-రెండును అగోచర ములే. "ఆకాశం గగనం శూన్యం" అన్నారు.

ఆలింగమున్నచోట తెర వేయబడియుండును. భక్తులు దర్శనార్థమై చేరినప్పుడు ఆతెర నటుతొలిగించి, ఇటు మరల మూయుదురు. అంతా క్షణములో జరుగును. కావున ఎవ్వరు చూచునదికాని, ఎవరికి కన్పించునది గాని ఏమియ్యులేదు. అదియే చిదంబర రహస్యము. సదాశివుడు నటరాజమూర్తియై సకలేంద్రియములును తన్మయత్వ మొంద-నృత్యభంగిమ చూపుచుండగా- ఆరహస్యమును తెలుసుకొనుటకై ఎవ్వడు తంటాలుపడును! కన్పించినా కన్పించకున్నా చూచి భక్తిభావమున నమస్కరించవచ్చును.

## పక్షితీర్థము (తిరుకైకుండ్రము)

❋

చంగల్పట్టు రైల్వేస్టేషన్‌లో దిగి సమీపమున యుండు పక్షితీర్థమను క్షేత్రమునకుపోయి సత్రములోదిగి శంఖుతీర్థమున స్నానముచేసి కొండ నెక్కితిమి. సుమారు 11 గంటలకు ఒక పండారము చక్కెరపొంగలిని పంపుకొని కొండపైకి వచ్చి పక్షులను చెయ్యితట్టి పిలుచును. అప్పుడు రెండుగాని మూడుగాని పక్షిరాజులు వచ్చి పండారమువద్దవాలును. అవి ఆ ప్రాంతముల కొండగుహాలనుండి వచ్చుట చూడ నగును. అయితే అవి ఒకటి కాశీనుండియు మరియొకటి రామేశ్వరమునుండియు వచ్చి నట్లు తీర్థప్రజల కతడు చెప్పును. పక్షిరాజులు వచ్చినవెంటనే పండారము వాటికి స్నానము చేయించి తిరుమణి శ్రీచూర్ణముతో అలంకరించి తెచ్చిన చక్కెరపొంగలిని పక్షులకు పెట్టును. పక్షులుతిని మిగిలిన ప్రసాదమును వచ్చినవారందరికి పంచిపెట్టును. ఆ పక్షులు వచ్చినద్రోవనే మరల యెగిరిపోవును. ఈ ప్రకారము దినము జరుగుచుండును. వందలాది సంవత్సరములుగ పక్షులు యిక్కడికివచ్చి దర్శనమిచ్చుచున్నట్లు స్థళపురాణముగలదు. పక్షులనుచూచిన చాలవయసు చెల్లినవిగ కనబడును. ఆ పండారము తీర్థయాత్రికులను ప్రసాదము స్వీకరింపకోరుచు క్రమముగా హిందీ, తెలుగు, తమిళములలో ఉపన్యసించును. కొండక్రిందయుండు శంఖుతీర్థమున 12 సం॥ కొకసారి శంఖమొకటి గొప్పధ్వని చేయుచు పైకిలేచునని అక్కడివారు చెప్పెదరు. అక్కడపుట్టిన శంఖములను కొండమీది స్వామి వద్దపెట్టి పూజించెదరు. ఈ కొండ ప్రదక్షిణమునుచేసినను ఈ పూరితీర్థమును పానము చేసినను సమస్తవ్యాధులు నిర్మూలమగునను తలంపుతో జనులు యిక్కడవచ్చి సత్రము లలో కాపురముండెదరు.

## కాంచీపురం

❋

ఈ పురాతనక్షేత్రమునకువచ్చిదిగితిమి. వరదరాజస్వామి దేవాలయమున అర్చన వగైరాలను జరిపించి గుడిలోయుండు బల్లిని తాకితిమి. ఈ బంగారు బల్లిని తాకినవారికి బల్లిపతనదోషముండదు. ఈ దేవాలయమున అయ్యంగార్లు కంచి యిడ్డిలిని తయారుచేసి విక్రయించెదరు. ఈ యిడ్డిలి 10 దినములవరకు చెడిపోక బాగుండును. ఒక యిడ్డిలిని సుమారు 10 మందివరకు ఆకలితీరునట్లు భుజించవచ్చును. దీనివెల అప్పుడు రు 2 లు. ఇక్కడి పుళిహోరకూడ రుచిగనుండును. ఎక్కడపోయినను వైష్ణవ దేవాలయములలో ఫలహారములు బాగుగ లభించును—పిమ్మట కంచికామాక్షిని పూజించితిమి.

మరునాడు ఏకామ్రేశ్వర దేవాలయమునకుపోతిమి. సామాన్యముగా నీ దేవుని, పామరులు (కొందరు పండితులును) ఏకాంబరేశ్వరుడు అందురు. అది పొరబాటు. దేవి ఈశ్వరునికై మామిడిచెట్టుక్రింద తపమాచరించెననియు, ఈశ్వరుడచ్చట ప్రత్యక్షమై

దేవిని వివాహమాడెననియు కథ. ఆదిలింగమని చెప్పబడునదొక్క టొక్కమామిడిచెట్టు క్రిందనున్నది. ఆ మామిడిచెట్టు చాలపురాతనమని వారు చెప్పుదురు. దానికి నాల్గుశాఖ లుండును. అవివేదశాఖలనియు అక్కడివారందురు. మామిడి అనగా సంస్కృతమున 'ఆమ్రము' కావున ఒక్క మామిడిచెట్టుక్రింద వెలిసిన దేవుని ఏకామ్రేశ్వరుడుఅందురు. (బ్రౌణ్యనిఘంటువులో : ఏకామ్రేశుడు- An epithet of Siva as worshiped at the pagoda at Conjeevaram under a 'single mango tree')

ఈ దేవాలయమును నాటుకోటుశెట్లు లక్షలాదులను ఖర్చుపెట్టి మరల కట్టించిరి. అక్కడి నల్లరాతిస్థంభములమీద చెక్కబడియుండు విగ్రహములను చూడదగినవి. శ్రీ ఆదిశంకరులవారి విగ్రహమున్ను ఈ దేవాలయముననున్నది. ఈ దేవునికి అర్చన అభిషేకములనుచేయించి స్వామి శెలవు తీసుకుంటిమి. వరదరాజస్వామి దేవాలయమున దొరికినట్లు ఫలహారములు యిక్కడ మాకు దొరకలేదు. మారేడుదళము భస్మము మాత్రమే లభించినవి. అయితే అక్కడి వాతావరణము నిరాడంబరముగను, నిశ్శబ్దము గను, గంభీరముగనుఉండి వైరాగ్యమున కనువుగానుండును.

కాళహస్తి

✻

సాలెపురుగునకు, పామునకు, ఏనుగునకు మోక్షమిచ్చిన ఈశ్వరుని క్షేత్రమగుటచే "శ్రీ కాళహస్తి" అని దీనినందురు.

ఇదియును పురాతనమైన మహాక్షేత్రము. రాజుపరిపాలన క్రిందయుండెను. ఆపురాతనపు విశాలమైన రాజవీధులను నగళ్లనుచూచినప్పుడు కంటనీరుకారును. ఏమూల చూచిన శిథిలమైన రాజగృహములే. లెక్కలేనన్ని బోడిలింగములను పట్టణమంతయు చూడవచ్చును. ఈ వూరు మేలయిన కొయ్యదువ్వెనలకు ప్రసిద్ధికెక్కినది. పల్లెటూరి వారు కట్టుకొనుకోకలనునేయు నేతగాండ్రకు యీ వూరు పేరుపొందినది. ఈ వూరిలో యుండు శిథిలమైన శివాలయమునుకూడ నాటుకోటుశెట్లు మరల కట్టించిరి. అయితే అప్పటికి పూర్తిగకట్టలేదు. ఈశ్వరునకు తుమ్మిపూల అర్చన విశేషముగనుక ఈ దేవాలయములో తుమ్మిపూలమాలలను సుందరముగకట్టి విక్రయించుచుందురు. స్వామిని దర్శించుటకు పోవువారందరు తుమ్మిపూలమాలలను తీసుకొనిపోయి లింగమునకు అలంకరించెదరు. ఈ వూరిలో నాకు మంచిస్నేహితులు N. సాంబయ్యగారున్నందున వారింటి లోనే బసచేసితిమి.

ఈ ఊరిప్రక్కన సువర్ణముఖినదియున్నది. అందలి యిసుకలోనుండి బంగారము తీయవచ్చునట. పాశ్చాత్యపరిశోధకులింకను పరీక్షించినట్లుతోచదు. ఈ ఊరినంటి

చిన్నకొండ తిప్పలున్నవి. ఆ తిప్పలమధ్య భరద్వాజాశ్రమమున్నది. అందొక తిప్పపై మూరెడుపొడవున దుబ్బుగాపెరుగు గడ్డియొకటిగలదు. ఆ గడ్డి భూమినుండి తీయకే పిడికెడు పోచలుచేతబట్టి ఏదైనను కోరుకొనుచు ముడివేసినచో ఆ కోరిక ఈడేరునని చెప్పుదురు. వెళ్లిన యాత్రికులందరున్నూ ఆ పనిచేసి వచ్చుచుందురు.

ఇచ్చటనే ఒక్కవిషయము చెప్పెదను. కాశీలో మాతోగూడ శ్రీ సంతాన రామయ్యంగారుండిరని చెప్పియుంటిని. ప్రస్తావన సమయమున కావున్నను, 1921 లో శ్రీ యర్. సాంబయ్యగారింట వారిపెద్దకుమార్తె వివాహసమయమున శ్రీఅయ్యంగారితో సహా మిత్రులమంతా చేరితిమి. వారు వైష్ణవులయ్యు శివకేశవ భేదము పాటింపక స్మార్తులగు మాతోపాటే శివలింగదర్శనముగావించి, విభూతిధరించెడివారు. కీర్తిశేషులైన మామిత్రుని విశాలభావమును సంస్మరింపగల్గినందులకు సంతసించుచున్నాను.

తిరుపతి



ఇక్కడనుండి ఏడుకొండలవానిని దర్శించుటకు తిరుపతివెళ్లితిమి. తిరుపతిలో ఒక యింటిని బాడుగకుతీసుకొని దిగితిమి. కొండకు నడిచియే నిదానముగ యెక్కగలిగితిమి. కొండపైకిపోయి యిరువురము క్షౌరకల్యాణమును చేసుకొని, తీర్థస్నానమునుచేసి, వెంకట రమణునిదర్శించి అర్చించి కర్పూరహారతి నిచ్చితిమి. చెల్లనికాసులను కొండికాసులను స్వామిహుండిలోవేసి నమస్కరించితిమి. అచ్చట మూడుదినములుండి దిగువతిరుపతికి వచ్చి స్వామిభార్య అలిమేలుమంగతాయారును దర్శించి కుంకుమార్చనను చేసితిమి.

తిరుపతి- ఎగువతిరుపతి, దిగువతిరుపతిఅని రెండుభాగములు. కొండక్రిందభాగము దిగువతిరుపతి; పైభాగము ఎగువతిరుపతి.

దిగువతిరుపతిలో గోవిందరాజస్వామి దేవాలయము చాలపెద్దది. యాత్రికులందరు ముందు దానిని దర్శింతురు. ఆ పిదప దిగువతిరుపతికి ఒకమైలు దూరముననుండు కపిల తీర్థంలోమునిగి మరీ కొండఎక్కుతారు. అది యొక జలపాతంవల్ల ఏర్పడ్డకొలను. ఆ జల పాతం ఒక హనుమంతుని విగ్రహముపై పడుచుండును. ఈతనేర్చినవారు ఈది వెళ్లి హనుమంతునితలపై కూర్చుండి జలపాతస్నానము నేరుగా చేసివస్తారట.

కొండను 5 మైళ్లదూరము నిలువున ఎక్కుదురు. మొత్తము 7 కొండలుఎక్కవలెను. మధ్యమధ్య అడవులు, తిప్పలు, సమతలములు ఉండును. ముఖ్యముగా మోకాళ్లపర్వత మెక్కుట చాలకష్టతరము. పూర్వము అందరు కష్టపడి ఎక్కేవారు. ఓపికలేనివారు డోలీలలో మోయించుకొని వెళ్లేవారు. ఇప్పుడు రోడ్డువేయబడినది; బస్సుకూడా

నడుచుచున్నది. అయితే అన్నిటికివలెనే ఈబస్సు ప్రయాణమునకున్న బ్లాక్ మార్కెట్టు ఏర్పడినదని వెళ్లివచ్చిన యాత్రికులు చెప్తున్నారు.

మొదట ఈ పర్వతం మేరుపర్వతంలో భాగమని - వాయుదేవునికి, ఆదిశేషునికి వాగ్వాదమురాగా మేరుపర్వతభాగమును తనపడగపై నెత్తుకొని ఆదిశేషుడు తన మహిమ చూపగా, వాయువా పర్వతము నెగురగొట్టి తనశక్తి చూపెనట. ఆ ఎగిరివచ్చిన పర్వతము - ఇట్లు ఈ ప్రదేశమున పడి తిరుపతి యైనది. తొలినామధేయము శేషశైలము లేక శేషాచలము.

ఎగువతిరుపతికి వెళ్లినవారు ముఖ్యముగా పుష్కరిణియందు స్నానముగావింతురు. ఆ కొలనినిండ పాచి నిండియుండును. అయితే అందలి స్నానము కలుషహారమని అందరును ముక్కుమూసుకొనియైన స్నానముచేతురు.

దేవాలయమునకు మూడుమైళ్లదూరములో మరియొకకొలను 'పాపవినాశం' అని గలదు. ఇది జలపాతముతో కూడిన కొలను. ఇదియు పాపహారము. ఇందుస్నానమొనర్చే వానిపాపముల పరిమితినిబట్టి నీరు నలుపుగా కన్పించునట.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి విగ్రహము చాలసుందరమును గంభీరమునై 7 అడుగుల ఎత్తున యుండును. ఈ విగ్రహము తొలుత శైవమనియు, శాక్తేయమనియు పండితులందురు. అందుకనుగుణ్యముగా జటాజూటము, ఫణిహారములు మున్నగు శైవచిన్నెలు విగ్రహముననుండుటయు, శివప్రీతికరమగు బిల్వపత్రిపూజయు, శాక్తేయమగు శుక్రవారపు కుంకుమ పూజయు స్వామికి జరుగుచుండుటను ఆ పండితులు తార్కాణముగా నుదహరింతురు.

మానుముంతలను కొయ్యబొమ్మలను కొన్నిటిని కొనుక్కొని బోడిగుండ్లతో మద్రాసుకు వచ్చితిమి. తీర్థయాత్ర సమారాధనను చేసితిమి. తిరుపతి ప్రసాదమును అందరికిని భోజనకాలమందు పంచిపెట్టి సంతృప్తులమైతిమి.






[డాక్టరు కోమన్ గారు మద్రాసు ప్రభుత్వపుటుత్తరవుపై 1921 లో-
మద్రాసు జనరల్ అసుపత్రిలో రోగులకు ఆయుర్వేద యూనానీ
ఓషధులనువాడి కనుగొన్న గుణగతములును కొన్నిటిని గతసంచికలో
నిచ్చితిమి. వానితరువాయి నీసంచికలో కొన్నిటినిచ్చుచున్నాము.
గృ॥ సం॥]

9. తగిరిశచెట్టు:- ఈచెట్టు పొలములలోను బీళ్లలోను మొలచును. ఈచెట్టు ఆకులోను, విత్తనములలోను, వేరులోను క్రిసాఫోనిక్ ఆసిడ్ Chrysophanic acid వున్నటుల కనుగొనబడినది. అనగ తామర, గజ్జి మొదలగు చర్మవ్యాధులను పోగొట్టుమందు. ఈచెట్టు ఆకునుగాని విత్తులనుగాని నిమ్మపండురసముననూరి తామర మొదలగు చర్మవ్యాధులకు పట్టించగ చాలమంచిగుణము నిచ్చినది.

10. జిల్లేడుచెట్టు:- ఈచెట్టు ప్రతిపల్లెలలోను సాధారణముగ మొలచుచెట్టు. దీనిలో తెల్లపూలుపూయు చెట్టు, యెర్రపూలు పూయుచెట్టు రెండు జాతులున్నవి. ఈచెట్టువేరు పట్టను యెండబెట్టి చూర్ణముచేసి 5 (grs) గింజలయెత్తును అనేకరోగులకు జనరల్ హాస్పిటలో (General Hospital) రక్తవిరేచనములతో (Dysentery) బాధపడు వారికి యివ్వగ అందరికి నెమ్మదించినది.

11. గచ్చచెట్టు:- గచ్చాకును ఆముదములోవాట్చి ముఖ్యముగ అండవాతములకు కట్టుకట్టిన గుణమునుయిచ్చినది. గచ్చపప్పును గంధముగనూరి వేడిచేసి వాపునకు పట్టించినను గుణమును యిచ్చినది.

12. రెడ్డివారి నానుపాలచెట్టు లేక నేలపాలచెట్టు:- ఇదియొక చిన్నచెట్టు. నేల పాకును. ప్రతిదొడ్లలో దొరుకును. చెట్టుకాడను గిల్లిన పాలుకారును. శ్వాసకాస (Asthma) మందులను తయారుచేయుటకు ఈమూలికను విశేషముగ ఇండియానుండి అమెరికాకు ఇంగ్లండుకు యెగుమతిని చేయుచున్నారు. ఈచెట్టుయొక్క అవలేహమును

(Thick extract) శ్వాసకాసములకు వాడితిని. అందరికి గుణమిచ్చినది. ఈమూలిక రొమ్ముపడిశము, మూత్రనాళమునుండికారు తెలుపు మొదలగు వ్యాధులకు చాలమంచివని చేసినది. ఈమూలికయందు నాకు చాలనమ్మకముకలదు. ఈమూలికలో తయారు చేయబడిన టించరును (Tincture) నాయింటివద్దకువచ్చు రోగులకు కిచ్చుచున్నాను. ఈటించరువలన శ్వాసకాసములు, మూత్రసంబంధమగు (Genito-urinary) గనేరియా మొదలగు వ్యాధులకు కఫవ్యాధులకు వాడి లాభమును పొందుచున్నాను. ఈటించరును జనరల్ హాస్పిటలో యుండు రోగులకు యిచ్చితిని. వారందరు కూడ వ్యాధి విముక్తు లయిరని డాక్టరు కోమన్‌గారు చెప్పిరి.

13. సాంబ్రాణిచెట్టు (నీరుబ్రహ్మి):-ఇదిచిన్నచెట్టు. నీళ్లకాలవల ప్రక్కన మొల చును. ఈచెట్టు ఆకుల రసమును తీసి, అరతులమును కొద్దిగ తేనెను కలిపి పిచ్చివాని కిచ్చిన మతిమంతు లగుదురనిరి. బ్రహ్మీఘృతమును ఉన్మాదము (Insanity)వాతోన్మా దము (Hysteria అపస్మారం)కు వాడగ అనుకూలించినదనిరి. అపస్మారవ్యాధి బ్రహ్మీఘృతమువలన బొత్తిగ పోయినదనిచెప్పిరి.

14. బొఱుడు చెట్టు (అరవములో వల్లారి అనెదరు):-దీని ఆకులు గుండ్రముగ నుండును. నీళ్లకాలువల ప్రక్కన నేల నల్లుకొనును. ఈచెట్టు సమూలమును త్రిదోష ములకు వాడెదరు. ఈమూలికను ముఖ్యముగ కుష్టు వ్యాధికి వాడుదురు. ఈచెట్టుతో తయారు చేసిన షరబత్తును (పానకము) జనరల్ హాస్పిటలు నందు వాడగ విచర్చిక (Psoriasis) మను చర్మవ్యాధి కొద్దిదినములలోనే గుణము కనుపించి మచ్చలు మాను టకు ప్రారంభించినవి.

# బ్రతుకు తెరువు

బిడ్డలు తండ్రులను కానులిమ్మని అడుగుదురు. కాని తల్లులతో తినడానికేమైనా పెట్టమని మారాము పెట్టుదురు. కావున బిడ్డలకుతగిన చిరుతిండ్లు వివేకముతో నేర్పుగాతయారుచేసి మోతాదుగాపెట్టి వారి ఆరోగ్యముచెడని బలవర్ధకమగు ఆహారముగానిచ్చుట తల్లుల కర్తవ్యము.

బిడ్డలకు ముఖ్యముగాకావలసిన బలవర్ధకమగు ఆహారపదార్థములలో, చక్కెరయొకటి చెప్పదగినది. జీడిపప్పులో-'ఆల్బ్యుమిన్' అనేఒక బలవర్ధకమగు పదార్థముకలదు. ఈరెంటితోచేరిన జీడిపప్పుమిఠాయి బిడ్డలకు యోగ్యమైన చిరుతిండిఅని వేరుగచెప్పవలయునా!

## జీడిపప్పు మిఠాయి

రెండువీశల పంచదారను, సుమారు 150 జీడిపప్పులను (ముంతమామిడిపప్పు-అని కొన్నిప్రాంతముల దీనినందురు) తీసికొనవలయును. ఈజీడిపప్పును బాదంపప్పువలె వేడినీళ్లతోకడుగుచూ మెల్లగాపైపొట్టును తొలగించవలెను. అట్లుశుభ్రమైన పప్పునుకత్తితో చిన్నచిన్నముక్కలుగా చేయవలయును. లేదా అట్లు ముక్కలుచేయు యంత్రములభ్యమైనచో దానినుపయోగింపవచ్చును. పంచదారకు తగినట్లునీళ్లుపోసి పంచదార పాకంపట్టవలయును. సిద్ధమైన జీడిపప్పుముక్కలను లేక కోరలను ఆపాకములోపోసి బాగుగా ఉడకనివ్వవలెను. అట్లు ఉడికినపదార్థమును వెడల్పాటి పళ్లెములోపోయగా అది ఆరుటకారంభించును. ఆ ఆరుట లోపల దానినికత్తితో కోణాకారముగను, బిళ్లలుగను కోసి జాగ్రత్తపరచి అప్పుడప్పుడు బిడ్డలు చిరుతిండి అడిగినప్పుడు మితమెరిగి మోతాదుగానిచ్చుచో, వారు అప్యాయముగాభుజింతురు. దీనివల్ల వారికేవిధముగను ఆరోగ్యముచెడదు. పైగాబలమును కలుగును. అవసరమున్నవారు దీనినితయారుచేసి విక్రయించుచో మంచి బ్రతుకుతెరువుగాకూడ ఉపకరించును.

## చక్కెర మిఠాయి

**నోటిలోవేసుకొని చప్పరించతగిన మెత్తని తియ్యని మిఠాయివుండలు.**

| | | |
|---|---|---|
| తెల్లని పంచదార | 15 | పలములు |
| నాటు పంచదార | 15 | ,, |
| మీగడ | 15 | ,, |
| వెన్న | 15 | ,, |

ఏకముగాచేర్చి చాలినన్నినీటితో పాకముపట్టవలయును. ఇట్టిపాకమును నిడుపాటి వెడల్పుగల పాత్రలోపోసి తదితర యిష్టమైన పదార్థములను చేర్చవలయును. పరిశుభ్రముగానున్నదా లేదాయని ఒకరోజు ఆగి మరలచూడుము శుభ్రముగాలేదని తోచినయెడల మరలకొంచెముసేపు నిప్పుసెగపైనుంచి అవసరమునకు తగినట్లు కొంచెముపాలుపోసి కలపవలయును. అట్టిదానిని వివిధమగు గుండ్లు, పొడవులుగా అచ్చులుపోయుదురు. పూర్వము-పాలబెండులు, నురుగుచక్రములు, చక్కెరచిలుకలు, పన్నీరుచెంబులు, యెన్నోవిధములయిన చిత్రములలో యిమిడియుండు బొమ్మలలో పోసేవారు. వానిని పంచదారబొమ్మలని చెప్పుచూ తినుటకు మధురముగానుండును. వీనినికొందరు శుభకార్యములందు, పడకగదులలోను, భోజనశాలయందును అలంకారముగానుంతురు.

## రసగుల్ల — పంచదారడొల్ల

| | |
|---|---|
| గోధుమపిండి | 8 భాగములు |
| మైదా | 2 భాగములు |
| పంచదార | 40 భాగములు |
| నీళ్లు | 12 భాగములు |

వీనితో మధురపాక మొనరింపవలయును. మొదట మైదాపిండిని పంచదారను కల్పియుంచవలయును. దీనిని మెత్తగాపిసికి ముద్దగా చేసినదానిని కొంచెము కొంచెముగా గుండ్రనివుండలను చేయవలయును. పంచదారతోటి పాక మొనర్చవలయును. అట్టిపాకములో యిట్టివుండలను వేయవలయును. వంటకము చేయవలయును. వానినితీసి మరల చల్లగానున్న పాకములో వేయవలయును. వేడిగానుండు పాత్రలోని నీరు చల్లగానుండకుండునట్లు చూడవలయును. అట్టిది వేడినీరు ఆవిరిరూపముగాపోవును గావున వంటముగిసినతర్వాత నిమిషమున కొకతూరి తయారగుచున్న రసగుల్లలపైనపడకుండా రెండు మూడుచుక్కల నీళ్లుచల్లుతూ అట్టివానిని తయారుగానుంచుకొని సిద్ధపరచియుండు పాకములో వేసిన గుల్లభాగమంతయు మధురరసముతో నిండి మృదువుగాను మెత్తగానుండును. ఇంకను విశేషమధుర సువాసనద్రవ్యములు చేర్చవలసియున్న రోజాపుష్పపు స్వరసముగాని కేల్ స్వరసముగాని లేకయిష్టమైన సువాసనద్రవ్యము చేర్చుకొనవచ్చును.






## —:గోంగూరతొక్కు పచ్చడి:—

గోంగూరతొక్కును పెట్టుకొని, రెండు మూడుసంవత్సరములవరకు వాడుకొనెదరు. ఈ తొక్కు పచ్చడిని నిల్వవుంచుకొనుటకు ముఖ్యముగ గుంటూరుజిల్లాలో మెట్టచేలలోని కూరయే చాల బాగుండును. నీళ్లుపోసి పెంచిన కూరతొక్కుకన్న బాగుండును. ముదిరినకూరను కొందరు తొక్కుకువాడెదరు. బెజవాడ ప్రాంతములవారు లేతకూరతోనె పచ్చడిని, తొక్కును పెట్టెదరు.

ఇది పెట్టు విధము:-గోంగూరను తెచ్చి ఒకరోజు నీడనఆరనిచ్చి, వెనుక కొద్దిగ వేయించి, కూరకుతగిన ఉప్పునుపోసి తొక్కి జాడిలో పెట్టవలయును. కుండలో నిల్వవుంచుటకంటె జాడిలో పెట్టిన పచ్చడి బాగుండును. కుండలో పెట్టిన కుండఉప్పురిసి పచ్చడి జిగటలేక యెండిపోవును. ఇట్లుఉప్పువేసిన పచ్చడి చాలదినములవరకు చెడిపోకుండును.

కొందరు మిరపపండ్లను, పచ్చిమిరపకాయలను కలిపితొక్కు పెట్టెదరు. గోంగూర కాడలలోకూడ పులుసుయుండునుగనుక కాడలనుతీసివేయక పచ్చడిని పెట్టినమంచిది. గోంగూరనుకొందరు వరుగుగాపెట్టకొని, వానాకాలమందు ఉపయోగించుకొందురు.

## —:చింతకాయ పచ్చడి:—

గోంగూరపచ్చడి యెంతముఖ్యమో ఆంధ్రులకు చింతకాయ పచ్చడి అంతముఖ్యము.

లేతచింతకాయ పచ్చడి:—చింతపిందెలనుదెచ్చి పచ్చిమిరపకాయలను ఉప్పునుచేర్చి పచ్చడినూరెదరు. కడపట కొతిమిరాకును లేక ఆవను బెట్టినూరెదరు. లేక నూనెలో యింగువ మిరపకాయలు మెంతులు వేయించి, ఉప్పుచేర్చి లేతచింతకాయ పచ్చడిని నూరెదరు. ఈ లేతచింతకాయలనే కొందరు వామనగాయ లనియు అందురు. ముదురు చింతకాయలనుకూడ పైవిధముగనే, కొద్దిగ పసుపునుకూడచేర్చి పచ్చడినినూరెదరు. కొందరు యీపచ్చడిలో నక్కదోసకాయముక్కలనుకూడ చేర్చెదరు.

## —:చింతకాయతొక్కు పచ్చడి:—

ముదురు చింతకాయలనుదెచ్చి కాయలలోని యీనెలను తీసివైచి కాయలకుదగిన ఉప్పునుజేర్చి, విత్తులతోగూడతొక్కి జాడీలనింపెదరు. వారముదినములపిమ్మట ఆ తొక్కులోని గింజలను యీనెలను తీసి వైచి, పచ్చడిలోపసుపును, ఇంగువపొడినివేసి తిరుగతొక్కి జాడీలలోవేసి మూతిని బిగించెదరు. ఇట్లుపెట్టిన పచ్చడి చాలదినములవరకు నిల్వయుండును.

ఈతొక్కును అప్పుడప్పుడు కావలసినంత తీసికొని, నూనెలో యింగువ, మిరపకాయలు, మెంతులు, ఆవాలనుపక్వముగా వేయించుకొని, నూరినపిమ్మట ఇంగువముక్కవేసి కలియనూరవలయును.

కొందరు చింతతొక్కులోని గింజలనుపారవేయక దానిలోనేవూరనిచ్చెదరు. ఈవూరినవిత్తులను అప్పు డప్పుడు భుజించెదరు. పుల్లగనుండును.

# శ్రీ త్యాగయ్య భక్తిమార్గము

సంగీతవిద్వాన్ కొప్పోలు సూర్యనారాయణరావుగారు.

భక్తిమార్గముయొక్క ప్రాముఖ్యతను శ్రీ త్యాగరాజుగారు జయమనోహరి రాగమందలి "నీ భక్తిభాగ్య సుధానిధి" అను కీర్తన యిట్లు విశదీకరించియున్నారు.

కీర్తన

పల్లవి॥ నీ భక్తిభాగ్య సుధానిధి నీదేదే జన్మము రామ ॥ నీ ॥

అనుపల్లవి॥ భూభారముగాని సురభూసురులై జనించిన ॥ నీ ॥

చరణము॥ వేదోక్తంబౌ కర్మము వెతగల్గు గతా గతమౌ -
నాదాత్మక త్యాగరాజ నాథా! అప్రమేయ! సదా॥నీ ॥

రామా! నీ భక్తి యనే యమృతసముద్రములో నీదునటువంటిదే జన్మమని పల్లవిలోనిభావము. అట్లుకానిది యెంత ఉత్తమమైన దేవతాజన్మమైనను బ్రాహ్మణజన్మమైనను భూమికి బరువేనని అనుపల్లవిలోనిభావము. వేదములందుచెప్పబడిన కర్మనుష్టానము (అనగా యజ్ఞములు మున్నగునవి) కష్టములనుగూర్చు జన్మపరంపరలు (గతాగతములు) కలుగజేయునవేగాని జన్మరాహిత్యమగు మోక్షమునకు సాధనములుగావు. దీనికి నీభక్తియే సాధనమని చరణములోని భావము.

ఈభావమే భగవద్గీత యందిట్లు చెప్పబడినది.

శ్లో॥ తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం—క్షీ
ణే పుణ్యే మర్త్యలోకే విశన్తి॥

యజ్ఞయాగాదులవలన గల్గు పుణ్యముచేత స్వర్గసుఖము ననుభవించి అది క్షీణించినతోడనే భూలోకమునకువచ్చి తిరుగ జన్మమెత్తవలయునని దాని తాత్పర్యము.

మరియు,

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ—
అహంత్వాం సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ॥

అను గీతము శ్లోకముప్రకారము అన్నికర్మములనువదలి నన్నొక్కనినే శరణు బొందుము. నిన్ను అన్నిపాపములనుంచియు విముక్తునిజేసి మోక్ష మొసగెదనని శ్రీకృష్ణుడు అర్జుననితో తన తుదిమాటను చెప్పియున్నాడు. పై రెండు శ్లోకముల భావమును సమన్వయించి త్యాగయ్యగారు ఈకీర్తన యిందు పాడియున్నారు. భక్తిమార్గమే ఉత్తమమని భావము.

భారత
స్వతంత్రోత్సవ
సందర్భమున

# కొలంబియా

రికార్డులను వినుడు

శ్రీమతి టి. సూర్యకుమారి పాడిన

GE. 6404

మ్రోయింపు జయభేరి
ఉదయమ్మాయెను హో!

G.N.RAO.

**సరస్వతీ స్టోర్సు...... మద్రాసు. 2**

# పల్లె, పల్లెలో ప్రసూతి వైద్యాలయాలు



భారతదేశంలో ప్రజాజీవితపరిమాణం 27 వత్సరాలకు మించివుండదు. ఆస్ట్రేలియాలో 67 సంవత్సరాలు. ఇంగ్లాండులో 63. ఇలాగే ఇతరదేశాలతో పోల్చి చూచుకొంటే మనదేశీయ ఆరోగ్యసంపద ఎంతహీనస్థితికివచ్చిందీ మనకు తెలియకపోదు.

మనకు లభించే ఆహారపదార్థాలలో శరీరపోషణకు కావలసిన వస్తుసంపత్తి కరువు కావడం, వచ్చేరోగాలను ఎదుర్కొనేశక్తి కొరతపడడం తరుచు జరుగుతూవుంది.

దీనికితోడు ఇతరదేశాలకు పోల్చిచూసుకుంటే శిశుమరణాలు ఎంత హెచ్చుగా వున్నది మనకు తెలుస్తుంది. వెయ్యికి 162 దాకా మనదేశంలో చనిపోతున్నారు. అమెరికాలో 54 మంది, ఇంగ్లాండులో 58 మంది మరణిస్తున్నారు.

ఈ మరణాలకు పుష్టికరమయిన ఆహారంలేమి ప్రధానకారణమయినా, వేరే ఇతర కారణాలుకూడా తోడయినాయి. బాల్యవివాహాలు, సంసారజీవిత విజ్ఞానకొరత, అన్నిటికీ మించిన వైద్యసహాయలోపం-శిశుమరణాలను పెంపొందించుతున్నాయి.

మనదేశంలో నూటికి 90 మంది పల్లెలలోనే నివసిస్తున్నారు. మనదేశంలో అనుభవంగల వైద్యులలో నూటికి 90 మంది బస్తీలలోవున్నారు. మనదేశంలో సుమారు 50 వేలమంది వైద్యులువున్నారు. వారిలో 2 వంతులమంది మాత్రమే లైసెన్సులుపొంది వున్నారు. దేశంలో 7000 కు తక్కువగానే నర్సులువున్నట్లు లెక్కలు చెబుతున్నాయి. వీటినిబట్టిచూస్తే 8000 మందికి ఒకడాక్టరు మనదేశంలోవున్నట్లు రుజువౌతోంది. ఇంగ్లాండులో కనీసం వెయ్యికి ఒకడు వున్నాడు. అమెరికాలో కనీసం 750 మందికి ఒకడాక్టరు చొప్పున పనిచేస్తున్నారు.

మనదేశంలో 56,000 మందికి ఒక నర్సువుంటే, ఇంగ్లాండులో 300 మందికి ఒక నర్సు, అమెరికాలో ఇంకాతక్కువ జనభాకే ఒకనర్సుచొప్పున పనిచేస్తున్నారు.

భారతదేశంలో 5 వేలమంది తరిఫీదయిన మంత్రసానులువున్నారు. అంటే 80 వేల మందికి ఒకమంత్రసాని వుందన్నమాట.

పైనచూపిన లెక్కలను పరికిస్తే, మనదేశంలో ప్రజలసౌకర్యాలు ఏవిధంగా, విదేశీయపరిపాలనాకారణంగా కుంటుపడ్డదీ, భారతజాతి నవనాళ్లు ఏవిధంగాక్రుంగి, కృశించిపోయేదీ మనకు ద్యోతకం కాకపోదు.

అసలే మనయువతీ యువకుల శరీరసౌష్ఠవాలు, ఆహారకొరత, సంసారజీవిత విజ్ఞాన లేమి కారణంగా—అంతంతగావున్నాయి. దీనికితోడు సంఘదురాచారాలు, వైద్య సహాయం అందుబాటులో లేకపోవడం మనజాతీయ ఆరోగ్యం నానాటికి తీసుకట్టె కావడానికి, ఈ నాడు దేశం రోగాల పుట్టకావడానికి ఆస్కారమయాయి.

శిశుమరణాలసంఖ్య తగ్గాలన్నా, భారతజాతీయఆరోగ్యం దినదినాభివృద్ధిని పొందాలన్నా, ప్రభుత్వం-భారతదేశ పునాదులయిన పల్లెలవైపు తమదృష్టిని ప్రసరింపజేయాలి. ప్రతిపల్లెలో ఒకప్రసూతి వైద్యాలయాన్ని స్థాపించాలి.

ఈనాడు భారతమహిళలను ఉద్ధరించటానికి పూనుకోవడం ఎంతోఅవసరం. వారి జీవితాలనే బలికొనే ప్రసూతికి తగిన సౌకర్యాలు, ఉచితవైద్యం, తరిఫీదునొందిన మంత్రసానుల సహాయ సహకారాలు వారి అందుబాటులో వుండేలాగచూడాలి. ప్రజాప్రభుత్వాలు జాతీయ ఆరోగ్యవిషయంలో ఎంతధనాన్ని వెచ్చించవలసినా వెనుకంజవేయకూడదు.

ప్రసూతి వైద్యాలయాల సత్వరస్థాపనకై మహిళా సంఘాలు, ప్రజాసంస్థలు, పెద్దలు ప్రజాప్రభుత్వాలపై ఒత్తిడి తీసుకురావాలి. ఈ నాడు భారతజాతి పునరుద్ధరణకు కావలసింది మాటలుకావు-చేతలు అని రాజకీయవేత్తలు గుర్తించాలి.

ప్రజాప్రభుత్వాలే కాకుండా, దేశంలోని ఉదారులయిన ధనికులు పల్లెలలో ఉచిత ప్రసూతిశాలలను నిర్మించటానికి వేగిరపడాలి. ఆనాడే భారతీయమహిళలు ఉత్తమ సంతానాన్ని కనగలుగుతారు.

—శ్రీ హరికృష్ణ.



# శ్రీ మ దా ది వె ల మ క న్య

★—o—o—o—★—o—o—o—★

గృహకళా ప్రపూర్ణః గృహలక్ష్మి యనంగఁ; స
హజపు వేషభాషలందుఁ గుదురుఁ;
లలిత కళలతోడ నలరారుఁ గీర్తి ల
క్ష్మియగుఁ శ్రీమదాది వెలమకన్య !!

— మాదిరెడ్డి సుబ్బరావమ్మ.

# బొంబాయి రాష్ట్రంలో ఆంధ్రులు

ఈరోజుల్లో ఏమూలచూచినా, ఏపత్రిక చదివినా, ఏఉపన్యాసంవిన్నా 'ఆంధ్రులకు రాష్ట్రంలేదు ప్రధాన మంత్రిత్వంలేదు, గవర్నరు పదవిరాలేదు-పరిశ్రమలులేవు, ప్రాజక్టులులేవు—అదిలేదు ఇదిలేదు' అనే ఘోష. అయితే ఆంధ్రులసంగతి యింతేనా? ఎప్పుడూ ఇంతేనా? కాదు-ఆంధ్రమాతలు, సాహసులు అయిన సంతానం కననేర్చినవారే. రాష్ట్రేతర ప్రాంతాలలో ఆంధ్రులు-లక్షలాదిగా ఉన్నారు. నిజానికి 3 కోట్ల ఆంధ్రులలో ఆంధ్రదేశంలో ఉన్నవారు మూడింట రెండు భాగములుమాత్రమే. వీరంతా ఆ యాప్రాంతాలకు వందలకొలది సంవత్సరాలక్రిందట వెళ్లి అక్కడ స్థిరపడ్డవారు. వారంతా ఆంధ్రులమనుకోరు. తెలుగువారము అనుకుంటారు. పనిపాటలుచేసే మగవారు అక్కడిదేశభాష నేర్చుకున్నా - గృహలక్ష్ములు మాత్రము ఇండ్లల్లో తెలుగేమాట్లాడుతూ తమమగవారు తెలుగుమరచిపోకుండా చేస్తున్నారు. అందుకు వారికి తెలుగువారంతా జోహారు లొనర్చాలి.

ఇప్పుడు బొంబాయి రాష్ట్రంలోని ఆంధ్రులనుగూర్చి మాత్రమే చెప్తాను. బొంబాయి, పూనా, షోలాపూరు, నాశిక మొదలైన ప్రాంతాలలో చాలామంది తెలుగువారున్నారు. ఒక్క బొంబైలోనే 3 లక్షలమంది ఉన్నారు. వీరిలో పలువురుఇండ్లు కట్టుట, నేత నేయుట అనునవి ముఖ్యవృత్తులుగా అవలంబించినారు. కొందరు మిలిటరీ వృత్తి కూడా చేయుచున్నారు.



ల॥ స॥ గౌరీబాయి

బొంబాయియందలి తెలుగువారు దాదాపు 250 సం॥లనాడు అచ్చటికి పోనారంభించినారట. అనగా సముద్రతీరమున బయలుగావున్న బొంబాయి పట్నమున పలుకట్టడములను మొదటినుంచికట్టి దాన్నిప్రపంచములోకెల్ల గొప్పనగరమగుటకు తోడ్పడిన బేలుదారీలు తెలుగువారే. వారిపిదప పద్మసాలీలు, పేరుప్రఖ్యాతులు సంపాదించినవారు. వీరిలో చాలామంది బాగుగా ధనముసంపాదించి ఆస్తుల నేర్పరచుకొని గౌరవముగా జీవనము చేయుచున్నారు,

అట్టి భవన నిర్మాణకులలో రావుబహ

దూర్ ఎల్లప్ప బలరాముగారొకరు. వారే బొంబాయినగరమున సుందరమగు రాజాబాయి టవర్, హైకోర్టు, సెక్రెటేరియట్ భవనములనిర్మించిరి. విశేషధనమార్జించిరి. ధనమార్జించుట చాలామంది చేయగలిగినపనియే. అయిన ఈతెలుగుగృహస్థు-లక్షలాదిధనమును దానధర్మముల గావించినాడు. ఒక్క తెలుగువారి వైద్య సహాయార్థమే 4 లక్షల రూపాయల వినియోగించిరి. వీరిసంస్థ లిప్పటికిని ఎల్లప్ప బలరామ్ పేరిట సాగుచున్నవి. ఈ ఎల్లప్ప బలరామ్‌గారి సతీమణి ఆ॥ స॥ గౌరీబాయిపటమును గాంచుడు; గాంభీర్య ముట్టిపడ ఈతెలుగు సౌభాగ్యదేవత కూర్చొనియున్నది.

గతశతాబ్దంమధ్యలో ఆంగ్లరాజ్యంస్థిరపడ్డ తర్వాత నూతనవిద్యావిధానముప్రకారం విద్యనేర్వవలెననే ఆసక్తి దేశమంతటాకలిగింది. అందరితోపాటు బొంబాయి తెలుగువారుకూడా విద్యాసక్తి కలిగి 1864 లోనే ఆంగ్లో వర్నాకులర్ పాఠశాల నేర్పరచుకున్నారు. 1874 లో తెలుగుగ్రంథాలయం ఏర్పరచుకున్నారు. 1896 లో వయోజన విద్యకై రాత్రిపాఠశాల నేర్పరచుకున్నారు. అన్నీ సాగుచున్నవి.

కొలదిసంవత్సరములక్రిందట పురాతనమైన తెలుగు గ్రంథాలయ వ్యవహర్తలు మాజీ మద్రాసు కౌన్సిలుఅధ్యక్షులు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారికిచ్చిన స్వాగతము తెలుపు పటమును గాంచుడు.



ఇరువై ముప్పై సంవత్సరములుగా క్రొత్తగా ఆఫీసులలో ఉద్యోగాలకు తెలుగువాళ్లుపోసాగిరి. వీరికి పాతవారికి కొన్నాళ్లు సంబంధం లేకుండేది. వీరినివారు ఆంధ్రులని వేరుగాచూచేవారు. ఇప్పుడిప్పుడు ఉభయులూకలిసిపోతున్నారు. అయితే ఈ క్రొత్తవారు తమ "ఆంధ్ర" సంజ్ఞ పాతవారికి తగిలింపక వారి 'తెలుగు' సంజ్ఞయే తాము గైకొంటే-కలయికచేత అందరూ ఒకటియై తెలుసుకొని 'ఆంధ్ర' 'తెలుగు' సంజ్ఞలు పర్యాయములుగా వాడుకోగలరు.

క్రొత్తగా ప్రారంభమైన ఆందోళనఫలితంగా 1908 లో తెలుగువిద్యానిధియు, 1914 న లింగూబాయి విద్యానిధియు నెలకొల్పబడినవి.



క్రొత్తగా ప్రారంభమైన ఆందోళన ఫలితంగా 1916 లో మొదట తెలుగు సమ్మేళనం జరిగింది. 1925 లో జరిగిన పూనాసభలో తెలుగుభాషను మునిసిపల్ పాఠశాలలలో చెప్పవలెనని యూనివర్సిటీ విద్యలోకూడా నేర్పవలెనని ఆందోళనచేయగా - మునిసిపాలిటీ వెంటనే అంగీకరించినది. యూనివర్సిటీ వారున్నూ 1942-43 లలో తెలుగుభాష నేర్ప నంగీకరించారు.

అప్పటి తెలుగువారికి రెండుబాధ లున్నవి. తెలుగువారు ఎక్కువగా పనిపాటలు చేసేవారు కావడంచేత వీరుండేచోటును 'కామాటీ' పురమంటున్నారు. 'కామాటీ' అంటే మరాటీలో కార్మికుడు అని అర్థము. నేడుపలువురు ధనాఢ్యులు, విద్యావంతులు, ఆస్తిపరులూ అయినా ఆ 'కామాటీ' అనేమాట తొలగలేదు, ఆపేరు సనాభాలెఖలలోనికిన్నీ ఎక్కినది. ఆపేరు తుడిచివేసుకోవాలని ఒక ప్రయత్నం.

రెండవది-నగర మధ్యస్థంలోఉన్న తమపురమంటియే-పడుప్రవృత్తివారి కొంపలేర్పడ్డవి. వాటివల్ల తెలుగువారెంతైనా బాధపడుచున్నారు. ఆఖరుకు తెలుగువారి బాలికాపాఠశాలకూడా ఆ సానికొంపలమధ్య ఏర్పడ్డది. ఎంత ఆందోళనచేసినా ప్రభుత్వంవారు కలుగజేసుకోరు. వీరినక్కడనుంచి తొలగిస్తే-నగరంలో మరేప్రాంతానికివచ్చి పడతారోఅని, ఎక్కడివారక్కడే భయపడుతూ వారినక్కడనే ఉండనీయండియని అంటున్నారు. కార్పొరేషన్లోకూడా ఇందుకనుకూలంగా తీర్మానంజరిగింది. అయినా అపని నెరవేరలేదు.

బొంబాయి, పూనా, షోలాపూరులలో మిలిటరీవృత్తి నవలంబించిన వారున్నూ పలువురున్నారు. తెలుగుసిపాయీలు గడచినరెండు యుద్ధములలోను పాల్గొని చాలా పేరుపడసినారు. సిక్కులకు, పంజాబీలకు, ఘూర్కాలకు తెలుగుసిపాయీలు ఎందునతీసిపోరని పేర్గాంచినారు. ఇదియంతయు వీరమాతలగు తెలుగు తల్లుల కడుపుచలువగదా!

షోలాపురమున తెలుగువారు పద్మసాలీలే విస్తారము. వీరచటికి తెలంగాణమునుండి క్షామాల కాలాలలోనే రాసాగిరట. రైలు పడ్డతర్వాత 1860-70 లలో మరీ హెచ్చుగా వెళ్లినారట. వీరు చిరకాలము పాతకాలపు మగ్గము పైననే నేయుచుండేవారు. ఈశత ప్రారంభంలో షటిల్ మగ్గంనేత స్వదేశీ యుద్యమఫలితంగా విస్తరించినది. బంగాళమునుండి వచ్చిన ప్రచారకులు కొత్తపద్ధతిని షోలాపూరులో ప్రవేశపెట్టినారు. ఇంతలో 1880 నుండి వృద్ధికా వచ్చిన బట్టల మిల్లుపరిశ్రమ గత 25 సం॥ల నుంచి చేనేత మగ్గములతో పోటీచేయుచున్నది. ఆపోటీలను నిలువజాలక పలువురు మిల్లుకూలీలగుచున్నారు. ఇంకను చేనేతనే ఆశ్రయించియున్నవారు చాల కడగండ్లు పడుచున్నారు.



ఇటీవల వీరిఆర్థిక, సాంఘిక, కార్మికపరిస్థితులను పరిశీలించుటకు - భారతసేవాసంఘమందలి గోకలే ఆర్థిక విజ్ఞానశాఖవారు-డా. కాఖడేగారిని నియమించిరి. "తెలుగుభాషమాట్లాడు 550 పద్మసాలీ కుటుంబములను సాకల్యముగాపరికించి వారొక రిపోర్టు తయారుచేసియున్నారు. వీరిలోకొందరు ధనవంతులైనను, అన్ని చేవృత్తులవారివలెనే వీరుచాలా దీనావస్థయందున్నారని ఆ రిపోర్టు. ఆ రిపోర్టుధర రు 10-0-0 లు.

శతాబ్దములక్రిందట వందలకొలది మైళ్లదూరమువెళ్లి కోట్లకొలది ఇతర భాషలవారిమధ్య నివసిస్తూ మాతృభాషయైన తెలుగుభాషను మరువలేదంటే—ఆకీర్తి - ఎక్కడికిపోయినా చలం పట్టి-ఇంట్లో తెలుగు మాట్లాడే—గృహలక్ష్మిది !

(ఇందు చాలాసంజాయిషీ శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల నరసింహాచార్యగారిచ్చినది. గృ॥ సం॥)

# కుమారీ !

శ్రీమతి చెదలవాడ నాగరత్నముగారు

శ్రీవరనాయకుఁ డగు కా
శీ విశ్వేశ్వరుని హృదయ సీమ నివాసం
బైవఱలు విశాలాక్షి స
దా విభవంబులను నిన్నుఁ దనుపుఁ కుమారీ.

ప్రతి మాసంబున వెలువడి
సతులకు సద్బుద్ధిఁ గఱపఁ జాలి విబుధ స
మ్మతిఁ గను "గృహలక్ష్మి" ననా
రతముం బఠియింపవలయు శ్రద్ధఁ గుమారీ.

జననీ జనకులు మెచ్చ న
తనిఁ బెండిలి చేసికొనుట తగుఁ; గాదేనిన్
జననికి రహస్యముగ నీ
మనసు వెఱింగింపు లజ్జ మాని కుమారీ.

అంతయు జరిగిన పిమ్మట
రంతాయె నఁటన్న పగిది రమణునిలో నే
కాంతముఁ గోరమి నీవా
రెంతయు నిను నెంచి యీసడింత్రు కుమారీ.

తక్కువ నోములు నోచుఁడు
నెక్కువ ఫల మందఁ గోర నెటులగు? నీవుం
దక్కిన యాతనిపై వల
పెక్కగ వర్తిల్లు సంతసించి కుమారీ.

పరిజనులతోడ నైనను
బరుషంబులు వలుకకుండఁ బను లన్నింటిన్
జరిపించు కొనగవలెఁ దెం
పరివై నీచముగఁ జూడవలదు కుమారీ.

ఈనాఁటిది రేపటఁ గొఱ
గానిదియౌ నాగరకత గల్గుచు నుండెన్
గాన నిది తెలిసి మెలఁగం
గా నగుఁ బదిమంది రీతిఁ గాంచి కుమారీ.

ఎది యెట్లు మాఱినను నీ
హృదయేశ్వరు నభిమతంబు నెఱుఁగుచు వర్తిం
చెదవేని మేలు; పెఱవా
రెది యెటు కాదన్న నీకు నేమి? కుమారీ.

ప్రాణముకంటెను మానం
బౌ నధికం బనుచు నహరహం బెంచుచు దు
ర్మానవ కృత కృత్యంబుల
లోనం బడకుండు పొంకె లొగ్గు కుమారీ.

చనువుం గల్గిన వారి న
యిన 'అతి సర్వత్ర వర్జయే' త్తను నార్యో
క్తిని నెంచి కోడిగపుఁ జేఁ
తను బలుమా రాచరింపఁదగదు కుమారీ.

Telephone No. 2422
,, 2863—2446

బెంగుళూరులోనా?

Telegrams: 'PLEASURE',

# శాస్త్రీస్ హోటల్‌లో బస చెయ్యండి

హోటల్ బృందావన్, హైగ్రౌండ్స్ హోటల్, రేసుకోర్సు యెదుట,

బెంగుళూరులో ఇదే అతి దర్జాయైన గొప్ప హోటలు;

బస చేయదగినది. పేరుకుతగ్గ ప్రాశస్త్యముగలది ఇదొక్కటే. ఒకమారు వచ్చి చూడదగినది



నవీనమయిన అన్ని ఏర్పాట్లతోను, సౌకర్యములతోను అలరారు ఉత్తమ తరగతికి చెందిన గొప్ప వసతిగృహమిది. సువిశాలమయిన, బాగుగా గాలివచ్చునట్టి గదులు, స్నానములకు ప్రత్యేక గదులు, అతి నవీనమగు శానిటరీ ఏర్పాట్లును గలవు.

ఫోన్ 2422

బ్రాంచ్:

శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరు సిటీ.

చాలా మితమయిన రేట్లకు బాగుగా అన్నిసౌకర్యములు అమరియున్న విశాలమయిన గాలిగల గదులు, ఆంధ్రభోజనము ఒక ప్రత్యేక విశేషము.

ఇది చదవండి:

దివాన్ బహదూర్ డి. శ్రీరామశాస్త్రిగారు, ఎమ్. ఎల్, విశాఖపట్టణము, ఇలా వ్రాశారు:

గతనెల 22 నుండి 24 వ తేదీవరకు మీబృందావనం హోటలులో బసచేసియుండిన నేనున్నూ మెసానిక్ అతిథులుగ వచ్చిన యితర మిత్రులున్నూ ఇందుమూలముగా మా సంతృప్తిని, సంతోషమును మీకు తెలియపరచుచున్నాము. మేమున్న కొద్దిరోజులున్నూ మీనౌకర్లు మాయెడల అతిశ్రద్ధ ఆదరణచూపియుండిరి. మా అవసరములన్నింటిని జాగ్రత్తగా అమర్చియుండిరి. మాకిచ్చినగదులు పరిశుభ్రముగానుండెను. భోజన ఫలహారాదులు సంతుష్టికరముగను రుచ్యముగను ఉండెను. మీహోటలుకు సర్వసౌభాగ్య అభివృద్ధులను కోరెదను.

ఆంధ్రుల నవీన సర్వజనామోదమందిన హోటలు

శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరు సిటీవారి నిర్వహణక్రింద ప్రారంభింపబడినది.





ఆర్. సుశీలాబాయి - సెక్రటరీ; యమ్. శ్యామలాంబ బి.ఏ., యల్.టి.; వార్షికోత్సవ అధ్యక్షురాలు కె. సుందరాబాయిగారు - సమాజం ప్రెశిడెంటు; టి. యల్. సరస్వతీబాయి, జాయింట్ సెక్రటరి.

(కుర్చీలలో కూర్చున్నవారు.)





వింజమూరి సోదరీమణులు

అనసూయాదేవి, బి.ఏ., సీతాదేవి, బి.ఏ.,

వీరిద్దరును అన్నగారగు శ్రీ ప్రభాకరరావు బి.ఏ.,తోబాటు "అనసూయ" పత్రికను సంపాదకత్వము వహించియున్నారు.



దీపావళి ముచ్చటు

# స్వాతంత్ర్య దీపావళి

రచన: శ్రీమతి తిమ్మరాజు హైమవతిగారు.



భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఇదే ప్రథమ దీపావళి. దీపావళి అనగా **(Row of lights)** దీపముల వరుసయని అర్థము. దీపావళి ముఖ్యోద్దేశ మేమనగా లోకంలో సుస్థిర శాంతి నెలకొల్పుటకై సత్యభామా సమేతుడైన శ్రీకృష్ణుడు దుర్మార్గుడైన నరకాసురుని వధించగా ప్రజలందరు ఆనందభరితులై తమగృహములను దీప తోరణంబులతో నలంకరించినారు. అదే దీపావళి. నాటినుండి మన మంతా కూడా ప్రతియేడూ దీపావళి పండుగ అమితోత్సహంతో జరుపుకొను చున్నాము.

నేడు మనదేశంనుండి నరకాసురుని వంటి బ్రిటిషు రాక్షసిని తరిమి వేసినాము. తత్ఫలితంగా ద్విగుణీకృతమైన ఉత్సహంతో దీపావళి పండుగ పాలించడమా అనేది పెద్ద సమస్య. బ్రిటిషుప్రభుత్వం పైదొలగినా నేడు ప్రజల్లో ఆనందం తాండవించడంలేదు. ఉత్సహం వెల్లివిరయడం లేదు. స్వాతంత్ర్య మన్నది పేరునకు వచ్చినది గాని, వాస్తవికానికి రాలేదు. ఎక్కడ చూచినా క్షుదార్తుల ఆకలిమంటలతో, పేదసాదల దీనారవములతో ప్రతిధ్వనిస్తోంది. లోకం వీటికి తోడు మతద్వేషాగ్ని మంటలు భగ్ భగ్ మండుతూనే యున్నవి. తత్ఫలితంగా పీనుగుల పెంటలు, ఎముకల ప్రోగులు, రక్తపు ధారలు- ఇట్టిహృదయ విదారక దృశ్యములు ప్రతీ మానవుని కలవర పరుస్తూయున్నవి. ఇట్టితరుణంలో ప్రజాప్రభుత్వం మనదైనప్పటికీ మనోభావ స్పందనచే బాధపడుతూ ప్రజా హితైక కార్యాలకై కట్టిన కంకణం జారవిడుస్తూయున్నది. మన ప్రభుత్వాన్ని బలపరుచు కొన్ననాడే గదా మానవకోటికి సుస్థిరమైన దీపావళి. కాబట్టి ప్రతి భారతీయుడు ఐక్యమత్యమనే ప్రతిమలో ప్రేమ అనే చమురుపోసి అజ్ఞానాంధకారమును పారద్రోలే విజ్ఞాన దీపికలు వెలిగించాలి. జ్ఞానమనే వెలుగును దశదిశల ప్రసవింపజేయాలి. బాణసంచాకు బదులు భగవత్ప్రార్థనలు చేయాలి. గాంధీమహాత్ముని ఆదేశానుసారం పిండివంటలతో కుక్షినింపకుండా ఉపవాస వ్రత మవలంబించడం మంచిది. స్వాతంత్ర్య సమరంలో అసువులుబాసిన భారత వీరులకు జోహారు లర్పించి విజయదీపికలు వెలిగించాలి. సోదరీమణులంతా బాణసంచా పేరిట ధనవ్యయం చేయకుండా స్వాతంత్ర్య దీపావళి జ్ఞానదీపావళిగా భావించి నిరాడంబరముగా జరుపవలెనని నా ప్రార్థన.

# శారద లేఖలు



సౌభాగ్యవతి కల్పలతకు

నెచ్చెలీ !

ఆలస్యమమృతమ్ విషమ్మను నార్యోక్తి మనరాష్ట్రోద్యమమున సార్థకమైనంత దృఢముగా మరేవిషయమునను కాలేదనియే చెప్పవచ్చును. ఏనాటిముచ్చట, ఎక్కడి 1913 సంవత్సరము! ఎక్కడి 1947 వ సంవత్సరము! 34 సంవత్సరముల దీర్ఘకాలమా! ఏదియైనను అతిత్వరముగా చేయుటెంతచెడుగో అత్యంతాలస్యముగానగుటయు నంత చెడుగేయందురుగదా. పచ్చికాయయు, తెగమాగినపండును అభోజ్యములేగదా! ఇంతదీర్ఘకాలము జరిగినప్పుడు ఈలోపల దేశకాలపరిస్థితులలోనేమి, రాజకీయవ్యవహారములలోనేమి, ప్రజల మనోభావములలోనేమి మార్పులుజరుగకుండ నెట్లుండగలవు? అసహాయోద్యమము కొన్నిబుద్ధులు నేర్పగా రాజ్యాంగసంస్కరణములు మఱికొన్ని బుద్ధులనేర్పినవి. యుద్ధతంత్రములు యింకాకొన్నిబుద్ధులు నేర్పగా, జిన్నాగారి వేరిడిలక్షణము యింకామఱికొన్ని బుద్ధులునేర్పినవి, కాంగ్రెసు యెలెక్షన్లు, మంత్రులకలాపములు యింకాకొన్ని సరిక్రొత్తబుద్ధులమప్పినవి. ఈ విధముగా దేశములో బయలుదేరిన ప్రతి యుద్యమము ప్రతిసంస్కరణము, ప్రతిమార్పు మనరాష్ట్రోద్యమముపై తన ప్రభావముచూపుచురాగా నేటికి మనరాష్ట్రోద్యమము స్వతంత్రభారతవర్షములో మనతోబాటు ప్రవేశించి నవ్యభారత ప్రజాపరిషత్తులో ప్రధానపరిష్కారవిషయమై తలచూపినది. ఇకనైననూటిగా గమ్యస్థానముచేరునో వక్రగతుల పరిభ్రమించి తెన్నుదప్పి తికమకలపాలగునో చెప్పలేము.

ఎంతసవ్యమైన విషయమునైనను, ఎంతసత్యమైన విషయమునైనను, ఎంతసహజమైన విషయమునైనను వక్రదృష్టితోజూచి ఊహాపోహలతో దోషములారోపించి వివాదించు దుష్కాలమిది. కావుననే ఎంతమంచి విషయముగూడ వికృతమై మనక్షోభము కలిగించుచున్నది.

అప్పుడే రాష్ట్రము కనుచూపుమేరలోనికి రాకమునుపే కలకలము ప్రారంభమైనది. ఒకరు కత్తులు దూయుదుమనిన నొకరునెత్తురు చిందించెదమనుచున్నారు. ముఖ్యముగా ఆంధ్రరాష్ట్రసమస్య నెదుర్కొన్న విషయములుమూడు. ఒకటి సరిహద్దులవారిగొడవ. రెండవది రాయలసీమ వారిరగడ. మూడవది ఆంధ్రులు తెలుగులు ఒకటికాదుకాన ఆంధ్రులకు తెలుగులకు ప్రత్యేకప్రత్యేకముగా రాష్ట్రములు కావలెననుజగడము. ముచ్చటగా యీ మూడువాదములుచాలును మనలను మఱిముప్పదేళ్లవఱకు రాష్ట్రప్రాప్తి లేకుండచేయుటకు. అన్నిటిలో చిత్రమైనవిషయము తెలుగువారి యిలవేల్పు యింటింటదైవము ఏడుకొండల వెంకటరమణుని స్థానము తిరుపతి అరవవారిదట. దీనికి దృష్టాంతరమేమనగా, ఆ దేవాలయమునందు అర్చాదికలములలో పాల్గొనువారును అచ్చట పులిహోర, దధ్యన్నము, చక్కెరపొంగలి కలుపువారును, ఆ కలిపినది తొలుదొలుత మ్రింగువారును, అరవఆచార్యులేనట, అందువలన తిరుపతివారిదేనట, ఎంతగొప్పఆధారము! ఆంధ్రదేశమున పెక్కుదేవాలయములలో స్థానాచార్యులుగా అరవవైష్ణవులేయున్నారు. మరి అయ్యరులకాఫీహోటలులు

భోజనపుహోటలులేని ఊళ్లుగూడలేవు. కనుక ఆంధ్రదేశమంతయు మాదేనని చెప్పుదురేమో. నోరుగలవానిదే రాజ్యము, వేలుగలవానిదే అధికారముగదా యిప్పుడు. తిరుపతిమాదని అరవవారనుటలో తప్పేమున్నది? మనప్రధానామాత్యులు నెల్లూరివఱకు వారిదేనని ఛలోక్తులు పలుకుచున్నారు. ఈయన అరవలకు ఆంధ్రుడు, ఆంధ్రులకు అరవ. వీరి అభిధేయములో పేచీలేకుండ తెలుగులరెడ్డిపదమును, అరవలయారుపదమును మిళితమై యున్నవి. మరి వీరెవరికిచెందినట్లు? అందువల్లనే ఎందుకుచెందనిమాటలు పలుకుచున్నారు.

రెండవవిషయము ఆంధ్రులువేరు తెలుగులువేరునట. ఈమధ్య ఒకశివగ్రామణి వాక్రుచ్చినాడు. ఇతనేగాదులెమ్ము ఇటీవలమఱికొందఱు పెద్దలుగూడ యిట్లుపలుకుటకు శంకింపకున్నారు. మనతెలుగునకేగాదు మఱికొన్ని దేశభాషలకుగూడ రెండుమూడుపేరులున్నవి. మనరాష్ట్రములోనే అరవమునకు తమిళమనియు, కన్నడమునకు కర్ణాటమనియు, మళయాళమునకు కేరళమనియు మారుపేరులున్నవి. అయినను అవి భిన్నభాషలుగాగాని, ఆ భాషలను మాట్లాడువారు భిన్నతెగలుగాగాని భావింపబడుటలేదు. ఈ దురదృష్టము ఒక్కమనతెలుగుభాషకేపట్టినది. తెలుగునకు ఆంధ్రమనుపేరుండుటచే ఆంధ్రతెలుగులు రెండుభిన్నములట. ఈభాషలుమాట్లాడువారు భిన్నతెగలకు చెందినవారట. ఈ దుర్వాదమును పామరులు చేసిన వారికేమి తెలియుననవచ్చును గాని పండితులుగూడ ననుచున్నారు. ఇదియే విషాదాశ్చర్యముల కలిగించుచున్నది.

అయినను ఇవి భిన్నభాషలెట్లయినవో తెలియదు. ఆంధ్రమునకు తెలుగునకుగూడ యిప్పటికిని అచ్చులు పదారు, హల్లులుముప్పదేడు, ఉభయాక్షరములుమూడు, వెరసి ఏబదియారుఅక్షరములే. అక్కరములలోగూడ భేదముకానరాదు. తెలుగువారైన శ్రీవావిలికొలను సుబ్బారావుపంతులుగారు శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణమువ్రాసినారు. శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు ఆంధ్ర శ్రీమద్రామాయణము బ్రహ్మాండ పురాణము వగైరాలు వ్రాసియున్నారు. భారతభాగవతాది యుద్గ్రంథములకెల్లను ఆదియందు ఆంధ్రమను మాటచేర్చబడియున్నది. ఈ మహాగ్రంథములు తెలుగువారనబడే రాయలసీమవాసులకును, ఆంధ్రులనబడు ఉత్తరసర్కారులవారికిని చక్కగాఅర్థమగుచున్నవి. వారిచేసమానముగా పూజింపబడుచున్నవి. ఇదియేగాదు రాయలసీమప్రాంతము వారేపత్త్రమువ్రాసినను, సర్కారులవారికిని, సర్కారులవారే పుస్తకమువ్రాసినను రాయలసీమవారికిని అర్థమగుచునేయున్నవి. "తెనుగుఞ్జేసెద" నన్నాడు నన్నయ, "ఆంధ్రావళిమోదముం బొరయ, వ్రాసెద"నన్నాడు తిక్కయజ్వ. ఆంధ్రతెలుగులు ఒకదానికొకటి పర్యాయపదములనే విషయముపై దృష్టాంతములెన్నియో విశదీకరించుచుండ, ఆంధ్రతెలుగులు రెండువేర్వేరుభాషలనియు కావున వీనినిమాట్లాడువారుగూడ భిన్నులనియువాదించుట కాలవైపరీత్యముగాక మరేమనవలయును?

వ్యవహారభాషలో ఈ ఉభయ ప్రాంతములవారికిని భేదమున్నదిగావున, వీరురెండుతెగలని మఱికొందఱు పలుకవినుచున్నాము. కాని యిదినిస్సారమైన వాదన.

సర్కారులు రాయలసీమయేగాదు; ఆంధ్రదేశమునందలి పదునొకండు జిల్లాలలోను ఏరెండుజిల్లాల భాషయు నొక్కవిధముగా నుండదు. విశాఖజిల్లా వాడుకభాషకును గోదావరి జిల్లాభాషకును చాలవ్యత్యాసమున్నది. గోదావరి, కృష్ణాజిల్లాభాషలకుగూడ పొంతనలేదు. అటులనే కృష్ణా, గుంటూరు జిల్లాలకును గుంటూరు నెల్లూరు జిల్లాలకును వ్యవహారభాషలోనెంతయో భేదమున్నది. జిల్లాలదాకపోనేల ఒక్కమన గుంటూరు జిల్లాలలోనే మెట్ట, మాగాణి, తాలూకాలవారి వాడుకభాషలో నెంత తారతమ్యమున్నదో నీవెఱుగని విషయముగాదుగదా. గుంటూరుజిల్లాకు దక్షిణముగానున్న ఒంగోలుతాలూకావారి వ్యవహారభాష జిల్లాభాషకంతటిలోను వేరుపరచినట్లు ఎట్లుండునో మనకుతెలియని సంగతికాదుగదా. ఇటులనే

రాయలసీమ జిల్లాలలోను జిల్లాజిల్లాకునుమధ్య వ్యవహారభాషాభేదమున్నది. తమిళులకు సన్నిహితముగా నున్న చిత్తూరివారి భాషకును, కర్ణాటకులకు సన్నిహితులుగానున్న బళ్లారివారి భాషకును వ్యత్యాసమున్నది. కావున వాడుకభాషా తారతమ్యమునుబట్టి రాష్ట్రభాషానిర్మాణములు జరుగవలెనన్నచో తెలుగునాడులోని పదునొకండు జిల్లాలకు పదునొకండు రాష్ట్రములుగ విభజించినను ఈసమస్య పరిష్కారముకాదు. ప్రక్కల ప్రక్కలనున్న ప్రాంతీయభాషల సాంకర్యమునబట్టియు, నైసర్గికపరిస్థితులనుబట్టియు, ఆచారవ్యవహారములను బట్టియు, జీవద్భాషయైన వ్యవహారభాష పలురీతుల భాషింపబడును. అది విడిపోవుటకొక కారణమనుట కంటె హాస్యాస్పదమైన విషయము వేఱొకటిలేదు.

మొత్తముమీద ఈపదునొకండు జిల్లాలవారు మాట్లాడుభాషయొకటగునా కాదా అనునదే గమనింపవలసిన ముఖ్యవిషయము, అయినచో అవిధముగాచూచిన రాయలసీమ వారును, ఉత్తరసర్కారుల వారును మాట్లాడునది యొకటేభాష. వ్రాయునదొకటే లిపి. ప్రకృతిసిద్ధమైన ఈప్రత్యక్షసత్యమును కాదని నిరూపించుట బ్రహ్మాదులకైన సాధ్యముకాని విషయము.

తుంగభద్ర ప్రాజెక్టుతోబాటు రామపాదసాగర ప్రాజెక్టు నేలతలపెట్టవలెనని దత్తమండలముల వారాగ్రహపడుచున్నారు. ఇది సర్కారాంధ్రుల స్వార్థమును సూచించుచున్నదని కొందఱు వక్కాణించుచున్నారు. ఈకోపమునుచెందినవారు ఒక్కవిషయము నాలోచించవలెను. గోదావరి కృష్ణా గుంటూరు నెల్లూరు జిల్లాలు మిగులుప్రాంతములుగాని తరుగుప్రాంతములుగావు. ఈ రేషనింగురోజులలో లేదేమోగాని ఇంతకు పూర్వము ఏలూరు బియ్యమనియు, తెనాలి బియ్యమనియు, నెలూరు బియ్యమనియు చెప్పుచు రాయలసీమ యంతటను నీబియ్యములు అంగళ్లలో విక్రయింపబడుట రాయలసీమవారికి తెలియనివిషయము కాదుగదా. తమకుసరిపోగా రాయలసీమకుగూడ అందజేయగల వరిపంట యిక్కడకలదని యీవిషయమువల్ల బోధపడుచున్నదిగదా. కనుక రామపాదసాగరప్రాజక్టు నిర్మింపకపోయినను సర్కారుజిల్లాలకు గింజకఱువులేదు. అయితే రామపాదసాగరప్రాజెక్టుయెందులకని ప్రశ్నింపవచ్చును. ఆంధ్రదేశము భారతదేశాంతర్గతరాష్ట్రము. అశేష భారతవర్షమునకు కావలసిన ధాన్యములు వస్తుసామగ్రులు సంతృప్తిగా ఉత్పత్తియగుటకు తగువసతులు చేయుటప్రభుత్వమువారి విధి. కావున జలసమృద్ధిగలచోట పంటలకుగావలసిన ప్రాజెక్టులను, ఖనిజములున్నచోట పరిశ్రమలకువలయు యంత్రాగారముల నిర్మింతురు. ఈదృష్టితో చూచిన ఖనిజసంపత్తిగల రాయలసీమ యందు యంత్రాలయనిర్మాణమెంత అవసరమో, జలసమృద్ధిగలచోట ప్రాజెక్టులనిర్మాణమును అంతఅవసరమగును. అంతియేగాని రామపాదసాగరప్రాజెక్టు నిర్మాణోద్దేశము సర్కారాంధ్రుల పొట్టనింపుటకు మాత్రమే గాదు. ఈప్రాజెక్టువలన లక్షలయెకరములు సాగుబడియైనచో విశాలభారతావనిలో తిండిగింజలకు పరదేశములనర్థించు దురవస్థకొంతతొలగును. టాజ్ మహాలువలె ప్రపంచములో నపురూపమగు నీప్రాజక్టునిర్మాణము అశేష భారతప్రజాక్షేమమెంచి హర్షింపదగినది. ఇట్టివిషయములలో రాయలసీమసోదరులేల అసహనము చెందవలయునో అర్థముకాకున్నది. అసలురాయలుసీమ పేరులోనే ఎంతయో అసహజమున్నది. ఈఅసహజమే అసహనమునకు దారితీయుచున్నది. రాయలరాజ్యము కటకపుఱేవుఱకు విస్తరించి, గజపతులనునోడించి, జయభేరి మ్రోగించియుండగ అతివిశాలాంధ్ర పరిపాలకుడైన కృష్ణదేవరాయలు అభిధేయమును అయిదుజిల్లాలకు అంకితమొనర్చి తక్కినసీమతో వేఱుపఱచి వేరుభావములు ప్రకటించుచుండుట రాయలరాజ్యవిస్తారమును, పరిపాలనాప్రాభవమును, వీరాగ్రేసరత్వమును కించపఱచుటయగునేమో యనిపించుచున్నది. రాయల అంతరాత్మ యిందుకు ఎంత విచారించుచున్నదో!

ఇంతకును భారతదేశమునకివి విషపుఘడియలు. ఈకారణముచే ప్రజలమనోభావములు వక్రించినవి. న్యాయమైనదృష్టియు, ఉదారమైనభావములును, సరళమైనపలుకులును శూన్యమైనవి. లేనిదోషము లారోపించి నిందించుటయు, అయినపనికాదని వాదించుటయు, అనినమాట కపార్థకల్పనచేసి ద్వేషించుటయు,

సర్వసామాన్యమైపోయినది. ఒకరియందు ఫలానిదోషముగలదని మనమనునప్పుడు లోపము మనయందు లేకుండవలయునను కనీసధర్మమును ప్రజలుపూర్తిగా విస్మరించినారు. తాముమాత్రము తమయిష్టప్రకారము విశృంఖలముగ మెలగవలెననియు, ఇతరులుమాత్రము శిష్టులుగనుండవలెననియుపలుకుట నేటిప్రజాధర్మముగ పరిణమించినది. ఈ పరిస్థితులలో ఎవరేదిసంకల్పించినను అనుమానములతో, అపనమ్మకముతో చూచి దానిని అణచివేయయత్నించుటలో నాశ్చర్యమేమున్నది? ఈ అసమయములో ఆంధ్రరాష్ట్రము తలపెట్టినచో వివాదముగాక ఆమోదమెట్లువచ్చును.

ఈ దినములలో రాయలసీమవారు సభలుజరిపి సర్కారాంధ్రులను కుట్రదారులనియు, కునీతులనియు, మోసగాండ్రనియు, పయోముఖవిషకుంభములనియు, ధనమదోన్మత్తులనియు, నాగరికతగలవారమనియు, విఱ్ఱవీగువారనియు చిత్తమువచ్చినట్లు పలుకుచున్నారు. మంచిచెడ్డలు యేఒక్కప్రత్యేకప్రాంతము వారిసొత్తుగాదు. మంచివారు చెడ్డవారు అంతటనుఉందురు. అనాగరికులై బజారునపడి తిట్టుకొను అసభ్యస్త్రీలకంటె పచ్చిపచ్చిగ నిండుసభలలో సర్కారాంధ్రులనుతిట్టుచు తామింకను మంచివారమని వీరుభావించుకొనుచుండినచో అంతకంటెపొరబాటు అమాయకత్వము వేరొకటుండదు. వారుసజ్జనులైనచో ఈ అసభ్యమైన దూషణపద్ధతివిరమించి తమరాయలసీమాభివృద్ధికి పాటుబడుట ఉచితమైనపని.

మిత్రురాలు
శారద

## మిత్రాంజనము (రిజిష్టర్డు)

స్థాపితము 1924

★ నొప్పులకు

★ బాధలకు

★ కాల్పులకు

దివ్యాంజనము

అన్ని మందుషాపులలోను దొరకును

ఏజంట్లు కావలయును.

**మిత్ర ఫార్మసీ (రిజిష్టర్డు)**

తెనాలి. M & S. M. Ry

---

వ్యాపారస్తులకు, వైద్యులకు,

వైద్యాలయములకు.

సరకులనాణెము, ధర సరసముచూచి రండి!

మా కంపెనియందు సిద్ధముగాలభించు

మంచి సరకులు.

| | | |
|---|---|---|
| జాపత్రి | దశమూలములు | కచ్చూర్ |
| జాజికాయ | మానిపసుపు | వట్టివేరు |
| ఏలక్కాయలు | లవంగపట్ట | సుగంధిపాల |
| చలవ మిరియాలు | లవంగాలు | నేలవేము |

ఇతర రకముల మందుల మూలికలు సప్లయి చేయబడును.

వివరములకు:—

**G. Kandasawmy Chetty,**
**Ayurveda, Siddah & Unani**
**Drugs Merchant,**
**54, Rasappah Chetty St,**
**Madras 3**

---

## ఆనందోత్సాహాల పునఃప్రాప్తి



పండిత డి. గోపాలాచార్యులవారి

## అరుణ

గర్భాశయ రోగనివారిణి

చాలకాలంగా గర్భాశయ రోగములతో పీడింపబడుచు, మూలబడి మూల్గుతున్న ఆమె నేడు ఆరుగ్మతల నుండి విముక్తినొంది, సంపూర్ణారోగ్యయై, వెనుకటివలెనే విందులు, విలాసములలో పాల్గొంటూ ఉత్సాహపూరిత జీవితమును గడుపుచున్నది.

**ఆయుర్వేదాశ్రమము లిమిటెడ్**
**మదరాసు 17**

# స్త్రీ సమస్యలు



ప్రశ్న:—నాకు చదువుకోవాలని చిన్నప్పటినుంచీ సరదా ఉంది. మావాళ్లకిష్టంలేకపోవడంవల్ల కుదరలేదు. నాకు పెళ్లిఅయిపోయింది. అత్తింటకూడా ఆ ప్రశంస ఎవరూ తేవడంలేదు. మావారినడిగితే ఏమంటారో అన్న బెంగ. ఏంచెయ్యను?

ఉత్తరువు:—వంటలక్కగా ఉండి, పిల్లలనుకని, ఆ పిల్లలను అజ్ఞానంతో పెంచుతూ, ప్రతీదాన్నీ వింతగా చూస్తూ జీవితంగడిపేకన్న చదువుకోవాలన్న ఆశ మీకుండడం చాలా మంచిది. సరదా ఉంటే పట్టుదలవస్తుంది. దీనితో ఏపనీ కష్టమనిపించదు. మీయింట్లో ఎవరేనా చదువుకున్నవాళ్లుంటే వారిదగ్గర ఆరంభించండి. మీ భర్త నేర్పితే మరీమంచిది. అతనికి కొంచం చాదస్తం ఉండి 'నీకిపుడు చదువేమిటిలే' అంటే నిరుత్సాహపడకూడదు. ఇరుగుపొరుగు అమ్మలక్కలతో మీరు సాధారణంగా లోకాభిరామాయణంతో తీరికైనపుడల్లా గడుపుతుంటారు. వారిలో ఎవరేనా చదువొచ్చినవారుంటే వారిదగ్గర నేర్చుకుంటుండండి. ఇంట్లో అత్తా ఆడపడుచుల కిది తెలిస్తే వారికి కొంత అసూయగా ఉండవచ్చు మీ సరదా చూసి. దీనివల్ల తగువులొస్తాయి. అంచేత కొంతకాలం విద్యాభ్యాసం గాచెయ్యాలి. మీ భర్తకిది తెలిసి అతడు మీ పట్టుదలకి సంతోషిస్తే యింక ఏ బెంగా ఉండదు. మిగతా వారిగోల మరిచిపోవచ్చు. సరదా, పట్టుదలా ఉంటే ఏదో తోవదొరక్కపోదు.

ప్రశ్న:—వివాహనిర్ణయాన్ని పిల్లలు తమనిర్ణయానికి సంపూర్తిగా వదలాలా? లేక యీవిషయంలో తల్లిదండ్రులకు ఏమేనా బాధ్యతఉందా? ఉంటే అవి ఎంతవరకు?

ఉత్తరు:—పిల్లలనిర్ణయమే ముఖ్యం. కాని వయస్సువచ్చేవరకూ పెంచి పెద్దవాళ్లనుచేసిన తల్లిదండ్రులకు కూడా పిల్లల వివాహనిర్ణయంలో బాధ్యతఉంది. ఎంతవరకూ అంటే—పిల్లలు రెండురకాలు. చదువుకుని లోకజ్ఞానంకలిగినవారు, అజ్ఞానులూ అని. మొదటిరకంవారికి ఎవరేనా ఏమైనా చెపితే అర్థంఅవుతుంది. అందుచేత తల్లిదండ్రులు తమపిల్లలకు నచ్చేరన్నవాళ్లు తమఅనుభవంలో చూపిస్తే అయోగ్యులనితోచినప్పుడు, మొండిగా అధికారయుతంగా 'వద్దు. బాగుండలేదు. వీలులేదు' అని చెప్పకుండా వాళ్లల్లో ఉన్నలోపాలు తమపిల్లలకు చూపించాలి. ఆ చూపించడమే ఒక చాకచక్యం. మొండిగా చెప్పేస్తే తాడు బారిపోతారు. ఇంక రెండోరకంవాళ్లకు తమకేది మంచిదో తెలియదు తమకు సరిగ్గా ఎలాంటివారిని కోరుతున్నారో అంతకన్నా నిర్ణయించుకోలేరు. అప్పుడు తల్లిదండ్రులు మగపిల్లలవిషయంలో—ఏదో కట్నమో, కుటుంబము చూస్తో పిల్ల నెమ్మదైనదనో, కాక తమపిల్లలను మనకి తమకు తెలిసిఉంటుంది కనుక దానికి అనుగుణ్యమైన గుణగతాలుకలిగిన పిల్లలను వెతకాలి, ఆడపిల్లల మాటలోకూడా—యీ మనోగతాల అన్యాయానికీ, అనుకూలతకీ ప్రాముఖ్యతయివ్వాలి కాని, యింత ఆస్తిఉందనో, బి.ఏ. చదివేడనో, పెద్దకుటుంబమనో, ఏదోపిల్లను తిండిదొరక్కపోతుందేమోనని ఆలోచించక పిల్లవ్యక్తిత్వాన్నిగుర్తించి గౌరవించే వరులను వెతకాలి. ఈమాత్రం పూచీ తల్లిదండ్రులకుంది. ఇది పిల్లలుకూడా గుర్తించాలి.

కె. సూర్యకాంతం.




## చిలుకూరుపై రెండవసారి రిజర్వుపోలీసుల దాడి—వీరవనితల ప్రతిఘటన— మానభంగం కారణంగా ఒక మానవతి ప్రమాదస్థితి:

కొత్తచిలుకూరిలో ఐదుగురుని విపరీతంగాకొట్టి వదిలివేశారు. ఆరుజాడీల సారాయితెప్పించుకొని త్రాగి మత్తెక్కి స్త్రీలపైకివెళ్ళితే స్త్రీలంతా ఐక్యంగా ప్రతిఘటించారు.

కట్టా శాయమ్మ అనేఆమె (విధవ) చేనువద్దనుంచి వస్తుండగా ముగ్గురు పోలీసులు ఆమెనుపట్టుకొని బలవంతంగాచెరిచారు. ముగ్గురు చెరచడంవల్ల ఆమెచాలా ప్రమాదస్థితిలోవుంది.

ఆంధ్రప్రభ 5.11.47

## పాకీస్థాన్ అంటే మాకెప్పుడూ ద్వేషంలేదు: శ్రీమతి సరోజనీదేవి విస్పష్టప్రకటన:

"పాకీస్థాన్ అంటే మాకెప్పుడూ ద్వేషంలేదు. ఆ అధనివేశం వర్ధిల్లాలనే మేమెప్పుడూ త్రా వుంటాం" అని లక్నోలో జరిగిన ఒక సభలో ఉపన్యసిస్తూ శ్రీమతి సరోజనీదేవి ఉద్ఘాటించింది.

అటు పాకీస్థాన్ గాని, ఇటుఇండియాగాని వర్ధిల్లాలంటే రెండురాజ్యాలుగూడా సమానభావంతో ప్రవర్తిస్తే సాధ్యమౌతుందనిగూడా శ్రీమతి సరోజనీదేవి ఈ సందర్భంలోఅంది.

తన ఉపన్యాసాన్ని ముగిస్తూ ఆమె అందరికి ఒక సందేశాన్ని ఇచ్చింది. ఇది మనుష్యలోకం. ఇందులో తరతమభేదాలులేవు. బాధ్యతవిషయంలోగూడా అంతే. ప్రపంచంలో వర్గసామరస్యంకోసం కృషిచేయాలంటే మనం ఈ రహస్యాన్ని గ్రహించాలి అని ఆమె అంది.

## నైజాంలో అమానుష చర్యలు: ఆంధ్రమహిళాకాంగ్రెసు కార్యదర్శి ప్రకటన:

ఆంధ్రరాష్ట్ర మహిళా కాంగ్రెసు ఆర్గనైజింగు శెక్రటరీ సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి నైజాం ప్రభుత్వపు అమానుష చర్యలను ఖండిస్తూ ఈదిగువప్రకటన చేస్తున్నారు.

నేడు నైజాంలో విద్యార్థులు పాటకపు జనము అనేకవిధముల హింసింపబడుచున్నారు. పేద జీవనమే దుర్భరమైనది. మానధనులైన అనేకమంది స్త్రీలు చెరచబడుచున్నారు, ఇదిచూచి విని యేహిందువు సహించగలడు ఇట్టిచర్యలు భారతజాతికేగాక, ప్రపంచములోని మానవసభ్యతకే అవమానకరం. దక్షిణపాకిస్థానము 1 నిర్మించుటకు పగటికలలుకంటున్న నైజాంప్రభుత్వము ప్రజాభీష్టమును యిప్పటికైనను గుర్తించక పోయిన స్వాతంత్ర్య సమరాగ్నిలో యీ సంస్థానము మిడతలా మాడిపోవుటయే రూఢి.

ఆంధ్రసోదరీమణులు ముందుకువచ్చి అప్రతిహతదీక్షతో ప్రజాస్వాతంత్ర్యసమరమును నడుపు సంస్థానకాంగ్రెసుకు యథాశక్తి విరాళములిచ్చి తోడ్పడ ప్రార్థన.

# ఖాదీ ఉత్పత్తి

శ్రీ టి. వి. రాఘవరావుగారు
మద్రాసు ప్రభుత్వంలో అసిస్టెంటు డెవలప్‌మెంటు కమిషనర్.

దేశంలోవున్న నలభైకోట్ల జనాభాలో నూటికి ౯౦ పాళ్లు గ్రామవాసులే కాబట్టి జాతీయ సౌభాగ్యం పెంపొందాలంటే, ఈనలభైకోట్ల జనాభాలో నూటికి ౯౦ పాళ్లు సామాన్య జనం నివసిస్తున్న ఏడులక్షల గ్రామాల ఆర్థిక పరిస్థితి బాగుపడాలా? లేకపోతే మిగిలిన ౧౦ పాళ్లులో మధ్యతరగతి జనాభా, పెట్టుబడిదార్లూ, ధనవంతులూ, ఆఫీసర్లు, వర్తకులు, దళార్లు నివసిస్తున్న రెండువేల ఏడు వందల పట్టణాల ఆర్థిక పరిస్థితి బాగుపడాలా? ఇది మీరే చెప్పండి బాబూ?

ఎంత తెలివితక్కువ వాడైనా యీ అంకెలను బట్టి, ముందు గ్రామాల ఆర్థిక పరిస్థితే బాగుపడాలి బాబూ అని నిస్సంకోచంగా చెపుతాడు. ప్రజా ప్రభుత్వాలు గ్రామ సౌభాగ్యం పెరగటానికి పనికివచ్చే ప్రణాళికలే వెయ్యాలిగాని, గ్రామాల సొమ్మంతా పట్టణాలకు పంపించే ప్రణాళికలు మాత్రం వెయ్యొద్దు బాబూ అంటాడు.

అందుకనే గాంధీగారు మన దేశంలో గ్రామ సౌభాగ్యం పెంపొందాలంటే, గ్రామ ఆర్థిక వ్యవస్థకు కీలకమైన రాట్నం పరిశ్రమను పునరుద్ధరించాలనియు అప్పుడుగాని గ్రామాలలోని తదితర పరిశ్రమలు దాని చుట్టూ తిరగవనియూ, యిట్లాంటి రాట్నం పరిశ్రమ ద్వారాగాని, గ్రామవాసులు తమ ఆహారోత్పత్తికి వినియోగించు కాలముపోను, మిగిలిన విశ్రాంతి కాలం సద్వినియోగపడి జాతీయ సౌభాగ్యాన్ని పెంపొందించటానికి తోడ్పడదని చెప్పుతున్నాడు.

దీనినే అఖిల భారత చరఖా సంఘంవారు, గాంధీగారి సూచనలతో మనదేశంలో ౧౫ రాష్ట్రాలలో మూడులక్షల మంది వడుకు వారిచేత, ఇరవై రెండువేల మంది నేతగాండ్రచేత, ఇప్పటికి ౧౭ సంవత్సరాల నుంచీ పనిచేయిస్తూ, ప్రతీసంవత్సరం ౪౦ లక్షల రూపాయల వరకూ మజూరీలక్రింద పంచి పెడ్తున్నారు. ఈమాదిరి దేశంలో వున్న అన్నిగ్రామాలలో యింటింటా రాట్నాలు పెట్టి పనిచేయిస్తే, ఇన్ని కోట్ల డబ్బు గ్రామవాసులకే మిగిలి, గ్రామసౌభాగ్యం పెంపొందుతుందని మనకు కార్యాచరణ ద్వారా దారిచూపిస్తున్నారు.

ఇక్కడ ఈవ్యత్యాసం కొంచెం గమనించండి. వస్త్రపరిశ్రమ నీవిధానంలో చేస్తే హెచ్చుమందికి పనికల్పించి, అపారమైన జనసామాన్యపు విశ్రాంతికాలాన్ని కార్యరూపంలోకి దించి, హెచ్చుడబ్బు గ్రామాలలో వుండేటట్లు చేయవచ్చో చూడండి.

ప్రస్తుతం, మన దేశంలోవున్న మూడువందల యాభై అయిదు మిల్లులూ ఎంతమంది కూలీలకు పని కల్పిస్తున్నాయో, అందులో యెన్ని మగ్గాలూ, ఎన్ని కదుళ్లూ పనిచేస్తున్నాయో. మీరు ఎప్పుడన్నా గమనించారా? అదే మాదిరి, దేశం మొత్తం మీద ౭ లక్షల గ్రామాలలో ఎంతమంది నేతగాండ్రు, ఎంతమంది వడుకువారూ, వారిమీద ఆధారపడ్డ వడ్రంగులు, కమ్మరులు, చాకళ్లూ, అద్దకం మొదలుగాగల వృత్తుల వారి కుటుంబాలు, ఎన్నిలక్షలున్నాయో ఎన్నడైనా ఆలోచించారా? అదే మాదిరి చరఖా సంఘం వారు; వారుపని చేస్తున్న కొన్నివేల గ్రామాలలోనే అన్ని రాష్ట్రాలలో కలసి, ఎంతమంది వడుకువారికి నేతగాండ్రకూ, ఎన్ని గ్రామాలలో పని కల్పించి, ఎంత కూలీ ప్రతి సంవత్సరం ఏగ్రామాని కాగ్రామంలో పంచి పెడుతున్నారో అదికూడా గమనించండి. వీటినన్నిటినీ బట్టి, ఏపద్ధతిలో మన దేశంలో వస్త్ర పరిశ్రమను నడిపితే, గ్రామ ఆర్థిక పరిస్థితి బాగుపడి, గ్రామసౌభాగ్యం పెంపొందుతుందో మీరే తీర్పు చెప్పండి. అది సాధ్యమవునో కాదో గమనించండి.

(సశేషం)

—ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని

# సంపాదకీయములు

## శ్రీమతి సరోజినీదేవి గవర్నరుపదవి

శ్రీమతి సరోజినీదేవిగారిని సంయుక్తపరగణాలకు తాత్కాలిక గవర్నరుగా నియమించియుండిరి. ఖాయపు గవర్నరుగా నియమింపబడిన శ్రీ డా. బిధన్‌చంద్రరాయిగారు ఇన్నాళ్లును విదేశములందు పర్యటన మొనర్చుచుండి ఇప్పుడే భారతదేశమునకు తిరిగివచ్చినారు. ఇకవారు ఆమె తొలగగా నా గవర్నరు పదవి వహించవలసియున్నది. అయితే వారు భారతదేశమంతటికి ఏకైక స్త్రీగవర్నను తొలిగించుటకు - ఆపదవి తానాక్రమించుటకు ఇష్టపడుటలేదు. వీరుచాలాసరసులు అనివింటాము, అట్టివారికి దాక్షిణ్యామే ముఖ్యలక్షణము. ఇప్పుడు కేంద్రప్రభుత్వమువారు శ్రీదేవిగారినే ఖాయముగా నాపదవి నిర్వహింపుడని కోరుచున్నారట. ఆమెయు నంగీకరింపవచ్చు, అంగీకరింపవలెననే మాఅభిలాష. మేమేయేమి? స్త్రీలోకమంతయుగోరును. ఇట్టిసన్నివేశముకల్పించిన శ్రీరాయిగారి సౌజన్యతను, నాజూకుతనమును మేము వేయి విధముల మెచ్చుకొనుచున్నాము. శ్రీదేవిగారును ఈ 3 నెలలుగా మిగతగవర్నరుల కేమాత్రము తీసిపోకుండా తనపదవిని నిర్వహిస్తున్నారు. ఆమెగవర్నరుపదవీకాలంలోనే—హిందీభాషలో గెజట్ ప్రచురణము; హిందీ భాషలోనే ప్రభుత్వవ్యవహారనిర్వహణము. హిందీభాషలోనే శాసనసభా కార్యకలాపము ప్రారంభమై నడుస్తున్నవి. అనగా భారతదేశంలో ఆచరణలోకూడా నిజమైన భాషాప్రయుక్తరాష్ట్రము ఆమె ఏలుబడిలోనేఏర్పడినది. ఇది అట్టిరాష్ట్రమునకై చాతకవ్రతములుచేయుచున్న ఆంధ్రకర్నాటకులకు ఎంతైనా ప్రోత్సాహకరము. మిగతరాష్ట్రములలో ఇచటనడుచుచున్న ముస్లింమైనారిటీల కుట్రలు గానము. ప్రభుత్వము నిర్వహించు కాంగ్రెసుపక్షమునందు అన్నిచోట్లలోవలెనేగల పార్టీలనుకూడా ఆమెయే సమరసభావమున నడుపుకొని వచ్చుచున్నదని విందుము. ఇట్టి ఆమె—ఖాయముగా గవర్నరుపదవి వహింపనున్నందులకు మేమెంతయు గర్వించుచున్నాము. శ్రీదేవిగారికీశ్వరుడు చిరాయురారోగ్యైశ్వర్యము లొసంగుగాక.

## బిడ్డలకు రేషన్

బియ్యము రేషన్ కాలక్రమమున 8 ఔన్సులకుదిగినది. 8 ఔన్సులు అర్ధతిండిఅని చెప్పనక్కరలేదు. రెండుసం॥లుం మొ 12 సం॥ల లోపు బిడ్డలకు అర్ధరేషనే. ముఖ్యముగా ఈవయసుబిడ్డలే పూర్ణఆహారముతిని పుష్టిపెట్టవలసివారు. ఈ వయసులోవచ్చు దౌర్బల్యము—ఆమరణాంతము వదలదు. ఈ వయసువారికి పూర్తిఆహారమనగా మూడుపూటలాఅన్నము. అన్నమునకుతోడు పండ్లు, పాలు, బిస్కతులు మున్నగు ఉపాహారములను బిడ్డలకిచ్చుటకు నేడు మధ్యతరగతిలో పైశ్రేణివారికిని సంభవముకాదు; శక్తిజాలదు. కావున మూడుపూటలఅన్నమే వారికి శరణ్యము. 4 ఔన్సులతో మూడుపూటలా అన్నముపెట్టుట సాధ్యముకాదు. 12, 16 ఔన్సులైనచో పెద్దవారే తమకడుపుకట్టుకొనియైన బిడ్డలకు మూడుపూటలా పెట్టుకోవచ్చును. కాని తమకే ఈ 8 ఔన్సులు చాలక తట్టిముట్టాడే తల్లితండ్రులు బిడ్డలకు మూడవపూట నేమిపెట్టుదురు? కావున ప్రభుత్వమువారు అవశ్యము—బియ్యమును బిడ్డలకును పూర్తిగా 8 ఔన్సులిచ్చుట అత్యవసరము అనిమేము వక్కాణించుచున్నాము. ఇప్పటికేవారు చక్కెరను పూర్తిరేషనిచ్చుచున్నారు. మరిబియ్యమును అట్లేపూర్తిగా ఇవ్వదగును అని మా అభిప్రాయము.

## ట్రాములు-బస్సులు—స్త్రీలు

ట్రాములలోను, బస్సులలోను నేడు ప్రయాణంచేసేవారి సంఖ్యపెచ్చుపెరిగిపోయిందిగదా. వానిలో తొడతొక్కిడి చెప్పతరముగాదు. స్త్రీప్రయాణికులు వీనిలో ఎక్కడానికి దిగడానికి పడేబాధకూడా చెప్పతరంగాదు. లోపలఉన్న ఆ కాస్తసేపు కూచోను స్థలంలేకపోతే-లేకపోవడమే సర్వసాధారణం-ఏ పురుషుడైనా దయదలచి లేస్తేసరి లేకపోతే ఆమె నిలుచుకోవలసినదే. ఊరకనిలవడమైనాసరవాలేదు. పదిమందిపురుషులఎదుట ఆమెనిలకడకొరకు టాపునకుఅంటియుండే కమ్మినొకచేతి నెత్తిపట్టుకొని ఆబండి వేగానికి అల్లిబిల్లిగా మెలికలుతిరగడం ఆమెకెంత అసహ్యకరమో; ఆ ఎదుటకూర్చున్నపరువుగల మగవారికెంత తలవంపులో ఊహింపదగును. కావున పురుషులు-యువతులురాగానే లేచిజాగాయివ్వడం నేర్చుకోవాలి. ఉత్తరపెన్సిల్వేనియాలో ఎంపోరియంనగరమందు స్త్రీలుహెచ్చుగాఉన్నందున వారేలేచి పురుషునకు తావిస్తారట. ఈమర్యాద ఆఎంపోరియం స్త్రీలవద్దనైన మనపురుషులు నేరిస్తేబాగుండును. అయితే చెన్నపట్నంలో కొందరునవనాగరికులగు యువకులున్నూ, బస్సుకండక్టరులున్నూ-పైపెచ్చుయువతులను వేళాకోళం చేస్తున్నారటకూడా. ఇదిఎంతైనా గర్హ్యనీయం. ఇలావేళకోళం చేయబడ్డయువతిగానిదీనిని కళ్లారచూచిన పెద్దమనిషిగాని-వెంటనేకనబడే పోలీసువానికి ఆ యువకుని, లేక బస్సుకండక్టరును అప్పచెప్పడమే దీనికి మందు. బస్సుయజమానులకు లేక ప్రభుత్వమునకు ఒకసలహాయిస్తున్నాము. బొంబాయి కలకత్తాలలో-ట్రాం, బస్సులలో స్త్రీలకు కొన్నిస్థలాలు ప్రత్యేకిస్తారని, వారులేనప్పుడే పురుషులుకూచోని వారు రాగానే లేచి జాగాయిస్తారనిఅంటారు. ఆ పద్ధతి మద్రాసులోకూడా ప్రవేశపెట్టవచ్చును.

## పాకీస్థాన్ నుండి వచ్చేశరణార్థులు

పాకీస్థానునుండి లక్షలకొలది ముస్లిమేతరులు శరణార్థులై ఇండియన్ యూనియన్‌లోనికి వస్తున్నారని రోజూపత్రికలలోచూస్తున్నాము. వారిలో లక్షాధికారులు సమేతంగా, కట్టుగుడ్డలతో, కాలిజోళ్లతో మాత్రమే వచ్చేస్తున్నారు. మిగతా తీసుకురాలేకపోతున్నారు, తీసుకవచ్చినాదారిలో ముసల్మాను దుండగీడులచే దోచుకోబడుతున్నారు. ఇలావచ్చినవారు స్త్రీలు, శిశువులు, వృద్ధులు సహా తూర్పుపంజాబుల లోను ఢిల్లీపరిసరాలలోను ఆరుబయట ఆచ్ఛాదనలేకుండాపడిఉన్నారట. శరదృతువు నగపడ్డది. హేమంత రుతువు అప్పుడే సూచిస్తుంటుంది, ఉత్తరహిందూస్థానంలో అంటిపుండువంటి చలి నోరుతెరచుకొని గాండ్రిస్తూవస్తున్నది; నేడో రేపో వీరిమీదపడి కొరికేస్తుంది. గర్భిణీస్త్రీలు, బాలింతలు, శిశువులు, రోగులు, వృద్ధులు వీరందరికి చలినుండి సంరక్షణకై దుప్పట్లు, మేజోళ్లు, ఉన్నిచొక్కాలు వగైరాపంపాలి. అట్లా పంపమని గాంధీ, పటేలు, మనగవర్నరుసతి, కేంద్ర ఆరోగ్యమంత్రిని శ్రీమతి అమృతకార్ మున్నగు వారంతా విజ్ఞప్తులుచేస్తున్నారు. ఈవిజ్ఞప్తిని ఆంధ్రులందరూ ఆదరించవలసియున్నది. వారిలోముఖ్యముగా గృహలక్ష్ముల కర్తవ్యమపారం. ప్రతిగృహలక్ష్మియున్నూ తమయింట్లో మరొకరు హెచ్చుగాఉన్నారని భావించి-గుడ్డపాత సంతనచేసి పంపవలెను. యువతులుకొందరు ఉల్లుతో బిడ్డలకు టోపీలు, మేజోళ్లు; బనియన్‌లు, రవికలు మున్నగునవి అల్లనేర్చియున్నారు. వారు తలాఒకటిఅల్లి పంపితేచాలు; ఇట్లా అల్లడానికి క్లబ్బులుగా ఏర్పడవచ్చు. వంతుకు వడ్లుమెదుగుతవని సామెత. ధనవంతులు ఉల్లుకొనియిచ్చి చేతనైనవారిచేత అల్లింపవచ్చు. బాలికాపాఠశాలల్లో ప్రతిరోజూ ఒకఅరగంట ఈ పనిచేయిస్తే, బిడ్డకు ఈ విద్యయందు ప్రావణ్యత కలుగుతుంది; పనీ అవుతుంది. ఎంతోసరుకు తయారుకాగలదు. కావున మా పాఠకురాండ్రను ఈ విషయములో పనిపూనుడని హెచ్చరిస్తున్నాము.






**బాలబంధు:**

తెలుగుపిల్లల మాసపత్రిక. ఎడిటరు: శ్రీ యస్. జి. ఆచార్యగారు. విడిప్రతి 0 2-0. సం॥రం చందా రూ 1-12-0. అడ్రసు: 39 ఆండర్‌సన్ వీధి, జి. టి. మద్రాసు.

పెద్దల్లో అనేక బంధుత్వాలున్నాయి. అమ్మమ్మ, నాయనమ్మ, తాత, నాన్న, మామ, బావ, అమ్మ అత్త, అక్కయ్య యిలాగ ఎన్నోవున్నాయి.
మరి—పిల్లల్లోనో రెండేబంధుత్వాలున్నాయి. చెల్లీ, తమ్ముడూను.
'బానిసత్వపు పీడ వదలిన తర్వాత అని అనడంలో జాతి, మత వివక్షతలులేకుండా పిల్లలందరూ చెల్లెలూ, తమ్ముళ్లూగవుంటారు.
ఇక—పెద్దవాళ్లకి చాలాపత్రికలున్నాయి.
మరి... పిల్లలకో! చాలాపత్రికలులేవు సరిగదా, పట్టుమని పది పత్రికలైనాలేవు.
స్కూల్లో చదువుతోబాటు ఆటలతోనూ, పాటలతోనూగూడ చాలావిషయాలు తెలుసుకోవచ్చు.
అలాంటివి తెలుసుకోవాలీఅంటే "బాలబంధు"లాంటి పత్రికలు పిల్లలకి చాలాఅవసరం.
పిల్లలసాహిత్యానికి సేవచేస్తున్న శ్రీ ఆచార్యగారికి అభినందనములు.

**అనసూయ:**

సర్వతోముఖవైజ్ఞానిక మాసపత్రిక. సంపాదకులు: వి. వి. యల్. ప్రభాకర్ బి. ఏ., అనసూయాదేవి బి. ఏ. సీతాదేవిగార్లు బి. ఏ ప్రతి 0-6-0. సం॥రం చందా రూ 6/- 3 క్రెసెంటుపార్కు వీధి, త్యాగరాయనగరు, మద్రాసు. స్వాతంత్ర్యసంచిక అందుకున్నాం. రాజకీయము, ఆర్థికము, సాహిత్యము, కథలు, విమర్శన, పాటలు, పద్యాలు, శాస్త్రము, లలితకళలుగురించి పెద్దలచే చెప్పుకోదగ్గ విషయాలు వ్రాయబడ్డాయి. శ్రీరాజాజీగారు సెలవిచ్చినట్టు అసూయలేకుండా పనిచేస్తూబ్రతకడం మనంనేర్చుకోవాలీ అంటే యీ 'అనసూయ' పత్రికను పఠించండి.

**ఉత్తరాంధ్ర:**

జాతీయ తెనుగు వారపత్రిక. సంపాదకులు: శ్రీ గరిమెళ్ల వెంకటరమణమూర్తిగారు, శ్రీకాకుళం.
ప్రతి 0-2-0 సం॥రం చందా రూ 6/-.

ఆంధ్రరాష్ట్రసంపాదనకై చేస్తున్న కృషికి యీ 'ఉత్తరాంధ్ర' ప్రతికానిర్వాహణము తోడ్పడుతుంది అనడానికి సందేహంలేదు. విశాఖపట్నం, శ్రీ కాకుళం, గంజాం, కోరాపుట్టి జిల్లాల్లోని ఆంధ్రుల సమస్యలు కష్టసుఖాలు తెలుపుకుంటూ, ఆంధ్రరాష్ట్రసిద్ధికై యీపత్రిక సేవచేయుట ఎంతయూ కొనియాడదగినది.

**ఆంధ్రజ్యోతి:**

సచిత్రమాసపత్రిక. దీపావళిసంచిక. ఎడిటరు: శ్రీ చక్రపాణిగారు. విడికాపీ రూ 1/-.
37, ఆచారప్పన్ వీధి, జి. టి. మద్రాసు.

## స్వీకారము



శ్రీ వడ్డాది పాపయ్య, బైద్యనాధ్ దాస్ చిత్రకారుల త్రివర్ణచిత్రములు యీసంచికను చక్కని అలంకారాన్ని చేకూర్చాయి.

సాహిత్యపరుల చక్కనివ్యాసములచే యీసంచిక అలరారుతూంది.

ఇందు ప్రతీవ్యాసమూ, కథ చదువరులను ఆకర్షిస్తూ, చక్కని విజ్ఞానాన్ని కలుగజేస్తోందని అనడంలో అతిశయోక్తిలేదు.

ఇందు శ్రీ కొప్పరపుసుబ్బారావుగారి 'పోట్లుజవాను' చెప్పుకోదగ్గది. దీపావళిసంచికను చక్కని ముక్కగా అందజేసిన శ్రీ చక్రపాణిగారు ప్రశంసనీయులు.

## చెన్నపట్నం — తెలుగుపట్నం;

గ్రంథకర్త: శ్రీరామచంద్రుని వెంకటప్పగారు. ప్రతి వెల రూ 1-8-0. వలయువారు: 15 వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు అని వ్రాయవలయును.

ఎప్పడోవస్తుంది, వస్తుందనుకున్న స్వరాజ్యము చటుక్కున వచ్చింది.

అలాగే—ఆంధ్రరాష్ట్రంకూడా తలవని తలంపుగా వచ్చేస్తుంది. సందేహంలేదు.

ఆ సందర్భములో చెన్నపట్నం అరవలకి వెడుతుందా, ఆంధ్రులకు వెడుతుందా అని ప్రజలలో ఆత్రత ఎక్కువగావుంది.

గ్రంథకర్తగారు 'మనవి'లో చెన్నపట్నాన్ని - తెలుగువారు రక్తం ధారవోసి సాధించమనిగాని, నీళ్లునములుతూ జారవిడువమనిగాని నేను ప్రతిపాదించడంలేదు. సాధించినా జారవిడచినా ఈ "పట్నం తెలుగుపట్నం" అని తెలిసిమాత్రం చేయండి' అని చెప్పారు.

ఈగ్రంథం ఆమూలాగ్రంగా చదివితే దాని యదార్థం విశదమవుతుంది. విశదమయినతర్వాత యీ పట్నం తెలుగు పట్నమే అని స్థిరపడడంలో విశేషంలేదు.

ఇందు శ్రీ తామరపాకం సుందరరావునాయుడుగారు, మద్రాసు కార్పొరేషన్ మేయరువారి తొలిపలుకు, శ్రీ ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యాగారి ఆశీర్వచనము, శ్రీ మారేమండ రామారావు ఎం. ఏ. పి. హెచ్. డి వారి పరిచయవాక్యములు 'చెన్నపట్నం-తెలుగుపట్నం'అనే గ్రంథవిషయాన్ని రూఢి చేస్తున్నాయి.

సరిగ్గా సమయానికి యీగ్రంథమును ఆంధ్రులకు అందజేసిన శ్రీ వెంకటప్పగారికి అభినందనములు.

త్వరలోనే రెండవసంపుటమునుగూడ ప్రచురించి యీ 'చెన్నపట్నం, తెలుగుపట్నమనే' విషయమును స్పష్టీకరించగలరు.

# ఆలిండియా రేడియో—మదరాసు

## "మహిళామండలి" కార్యక్రమాలు

నవంబరు 15 తే. నుంచి డిసంబరు 15-వ తే. వరకు

నవంబరు

**మంగళవారం 18 తేదీ** తావిరహే-అష్టపది. ఇల్లాలి ఇబ్బందులు-ఈపూట ఏమివండటము? ఎస్. సూర్య కాంతమ్మగారి ప్రసంగము. తీర్థయాత్ర-శ్రీరంగపట్టణము-టి. సుశీలదేవిగారి ప్రసంగము.

**లక్ష్మివారము 20 ,,** స్త్రీ స్వాతంత్ర్యపరిణామాలు-దేశ సాంప్రదాయాలు. డి. సుభద్రా చెంచయ్యగారితో సంభాషణ. కుటుంబ పరస్పరము-వచ్చే పోయే బంధువులు: కె. వి. మాణిక్యంగారి ప్రసంగము.

**శనివారము 22 ,,** రావో రావో నాప్రియసఖి-యుగళగీతము. ఆధునికుల దృష్టిలో పురాణ పాత్రలు. అహల్య-రూపకము. మహిళాలోకము

**మంగళవారము 25 ,,** విఖ్యాతనారీమణులు-బీట్రిస్ వెబ్-ఆర్. కనకదుర్గాదేవిగారి ప్రసంగము: పిల్లల ఆటలు-ప్రమాదాలు-టి. అహల్యాదేవి ప్రసంగం, మంగళము.

**లక్ష్మివారము 27 ,,** వీటిమాట ఆలోచించిరా? వరకట్నాలు. ఎమ్. వైదేహిగారి ప్రసంగము; మీరు చదివారా? షా రచించిన నాటిక సేంట్ జోన్-ఎ. గిరిజాగారి ప్రసంగము.

**శనివారము 26 ,,** తారాపథము-సి కృష్ణవేణితో పరిచయము, మహిళాలోకము.

డిశంబరు

**మంగళవారం 2 ,,** బంగారు పైరు నేలల్లో-యుగళగీతి. వీటిమాట ఆలోచించారా? దేశభాష-మాతృభాష: కె. సీతారామమ్మగారితో సంభాషణ: ఆహార పదార్థాలు-కాయగూరలు అరటి, ఆనప, అలచందలు, ప్రసంగము.

**లక్ష్మివారము 4 ,,** వివిధదేశాల వింతఆచారాలు-చీనాదేశీయులు: ఐ. వి. మైత్రేయిగారి ప్రసంగము. ఆంధ్రవనితలు-నాగమ్మ-ఎ. రాజేశ్వరిగారి ప్రసంగము.

**శనివారము 6 ,,** మా వదిన సంసారము-రూపకము. ఉత్తరము వ్రాయడము. నవ్వకపోతే పోనీలే: మహిళా లోకము.

**మంగళవారము 6 ,,** మలయపవన-యుగళగీతము. స్త్రీ సౌభాగ్యసోపానాలు- హిందూ స్త్రీ ఆస్థి హక్కు చట్టము-సంభాషణ. ఆహారపదార్థాలు-దుంపలు, చిరుగడ్డము-కర్రపెండలము, బంగాళాదుంపలు ప్రసంగము.

**లక్ష్మివారము 11 ,,** వివిధదేశాల వింత ఆచారాలు-జపానీయులు: వేదాంతం సుశీలాదేవిగారి ప్రసంగము. స్త్రీ-పురుషుల నిర్వచనాలు: జె. ఎస్. మిల్ అభిప్రాయాలు-కె. యశోదాదేవిగారి ప్రసంగము

**శనివారము 13 ,,** తారాపథము-పరిచయము. ప్రపంచ విషయాలు-వి. విశాలక్ష్మిగారి ప్రసంగము.




Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd. 15 Westcott Road, Royapettah, Madras. Editor . Dr. K. N. Kesari.